# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట్రామానాయుడుగారు.

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 9
28-2-1986
శుక్రవారం
12 పేజీలు: రూపాయి


## ఓటమికి బాధ్యత మీదే...

### శాసనసభ్యుల సమావేశంలో మామా అల్లుళ్ళ సంవాదం

### లేదు.. మనం ఓడిపోలేదు!


మా ప్రత్యేక విలేఖరి


"రాజకీయ సన్యాసం" అంటారే-అటు వంటిదేదో తెలుగుదేశం అధినేతను ఆవహించినట్లు కన్పిస్తూంది. ఎవరికళ్ళలో చూసినా భయం తాలూకు నీలి నీడలే! మంత్రివర్గంలో కూడా వణుకుపుట్టింది. చలి జ్వరపీడితులవలె గడ గడ వణికిపోతున్నారు: ఏరాత్రి ఏమిన్ను విరిగి మీదపడుతుందో తెలియక, ప్రతిరాత్రి శివరాత్రి జాగారం చేస్తున్నవారు కొందరైతే, తమ నీడనుచూసి తామే భయంతో ఉలిక్కిపడుతున్నారు ఇంకొందరు భీరులు.

ఈ దౌర్బల్య మానసికస్థితికి సాక్షాత్తు ముఖ్యమంత్రి వర్యులు అతీతం కాకపోవడంవల్ల-ఆయన ధోరణి వారి లక్ష్యం తమలో భీతిని, ఆందోళనను ఇంకా పెంచుతుండడం, తెలుగుదేశం వాదులను మరింత కలవర పరుస్తూంది.

తన పదవికి ఎసరుపెట్టడానికి శత్రువులు పన్నేవ న్నాగా లు ఫలించబోతున్నాయేమోనన్న శంక ఎన్ టి ఆర్ లో అంకురించింది. దీన్ని ఆయన దాచుకోవడంలేదు; బహిరంగంగానే చెప్తున్నారు. చెప్పడంవరకైతే సరిపెట్టుకోవచ్చు; ఆ భీతితో ఏనుగంతమనిషి, గడగడలాడిపోతున్నాడు; కళ్ళనీళ్లు పెట్టుకుంటున్నాడు; కొండంత దుఃఖాన్ని గుండెనిండా నింపుకొని గోడుగోడుమంటున్నాడు.

మొన్న 24 తేది జరిగిన తె. దే. శాసనసభ్యుల సమావేశంలో అన్నగారు ఈ భయాన్నంతా వెళ్లగ్రక్కి న తీరు చూస్తుంటే- పదవివియోగ శంకతో ఆయన లోలోపల ఎంత మధనపడి పోతున్నాడో, కుంగిపోతున్నాడో, కృశిస్తున్నాడో అర్థమైపోతుంది: జాలితో ఎవరి హృదయమైనా ఆర్ద్రమౌతుంది.

'ఎందుకోసమీ అధికారం? ఎవరికోసమీ అధికారం? పాలుత్రాగేతల్లి రొమ్మును గ్రుద్దడానికి నాకెంతో ప్రియమైనతమ్ముళ్లు కుట్రలుపన్నుతుంటే, నేనెందుకుండాలి కొద్దుపదవిలో? అసలు నన్నెందుకు లాగారీ కుళ్ళురాజకీయాలలోకి. వద్దు.... వద్దు.... వద్దు....- ఒక్క క్ష ణ మై నా నాకీ ప ద వి వద్దు: వద్దుగాక వద్దు. మీలో వుత్సాహం వుండేవారెవరైనా వుంటే ముందుకు రండి- ఈ ప ద వి మీకప్పజెప్పేస్తాను....' -ట్లా సాగిందట ఎన్. టి. ఆర్ ప్రసంగధోరణి. మధ్యలో దుఃఖం ఆపుకోలేక ఆయన కళ్ళవెంట బొటబొటా కన్నీళ్ళు కారాయట; గొంతు బొంగురుపోయిందట.

ఆ తర్వాత ఆయన ముఖ కవళికలు మారి, ఎమ్మెల్యేలంటే తనకెంతప్రేమో కడురమ్యంగా వర్ణించాడట. వారడిగిన పనల్లా చేయమని మంత్రులను అదేశించాడట. మంత్రులు తమమాట క లె క్క రే వినడంలేదని ఫిర్యాదుచేస్తే, రౌద్రరూపం దాల్చి, పళ్ళు పటపటకొరికి, ప్రజలెన్నుకున్న మనమాటవినని అధికారులను అణచివేస్తానని ప్రగల్భాలు పలికాడట. ఎమ్మెల్యేలనందరినీ పేరుపేరునాపిల్చి, స్వీట్లుచేతికిచ్చి, నవ్వి, నవ్వించి పంపాడట. మయసభచూచినంత పైకంతో తిరిగివచ్చారు, మీటింగునుంచి ఎమ్మెల్యేలు.

ఈ నవరస నటనా వైదుష్య ప్రదర్శన కంతటకూ కారణం - 17 తేది జరిగిన శాసనసభ్యుల సమావేశంలో డాక్టర్ వెంకటేశ్వరరావు ఉరాలు మిరియాలు నూరడమేనట. వెంకటేశ్వరరావు మాట్లాడిన ఒక్కొక్కమాట, ఒక్కొక్క ముల్లుగా మారి అన్నగారి హృదయాన్ని తూట్లు పొడిచాయట. ఆ సమావేశంలో మామా అల్లుళ్ళ సంవాదం, వీధి నాటకంవలె భలే రంజుగా వుంటిందని, తామంతా కళ్లప్పగించి, లొట్టలు వేసుకుంటూ ఈ దృశ్యం చూచి తరించామని ఎమ్మెల్యేలు సంబరంగా చెప్పుకుంటున్నారు.

హైదరాబాదు న గ ర కార్పొరేషన్ ఎన్నికలవిషయంలో తెలుగుదేశం వైఫల్యాలను, నాయకుల ప్రవర్తనను వెంకటేశ్వరరావు దుమ్మెత్తిపోశాడట. "చరిత్ర, చరిత్ర అని చంకలు గుద్దుకుంటూ, దేశ అధ్యక్షుడుగా మీరు, 'క్రపెత్తనం చేసిన అధినేతలు' ఆత్మవిమర్శ చేసుకోండి- ఆత్మవంచన మానండి- అన్నాడట వెంకటేశ్వరరావు.

45 నిమషాలపాటు గ్రుక్కతిప్పుకోకుండా ఆయన మాట్లాడుతుంటే ఎన్. టి. ఆర్. చంద్రబాబుతో సహా అందరూ నిర్విణ్ణులై పోయారట, ఒకదశలో ధిక్కారం సైచ లేక- "లేదు.. లేదు.... మనపార్టీ ఓడిపోలేదు; మనం గెలిచాం; ప్రజలు ఇంకా మనవైపే వున్నారు, మీరు పొరబడుతున్నారు, ఆవేశంలో విదేశపత్రికలలో పార్టీఘనతను చాటుకున్నారు: నీతి నిజాయితీలకు, ప్రజాస్వామ్య విలువలకు మేముపెట్టిందిపేరని ప్రకటించుకున్నారు: ప్రజలను నమ్మించారు: ఇప్పుడు మీరే ప ని కి మా లి న కార్పొరేషన్ పదవులకోసం నానాగడ్డి కరిచారు: ఎన్నికలలో డబ్బు వెదజల్లుతున్నదని కాంగ్రెసునుతిట్టినమీరే,లక్షలు క్రుమ్మరించారు: ఎమ్మెల్యేలను, మంత్రులను బానిసలకంటేహీనంగావాడుకున్నారు భారీఎత్తున బయట జిల్లాలనుంచి దొంగ ఓట్లు వేయడానికి మనుషుల్ని తెప్పించారు: పోలీసుల్ని కార్యకర్తలవలె వాడుకున్నారు: ఇంతచేసి దారుణంగా ఓడిపోయారు: ప్రజల్లోకిపోతే, వారు మనల్ని చూసి నవ్వుతున్నారు: ఛీకొడుతున్నారు. ఇప్పటికైనా ఈ ఎన్నికలలో మనం ఓడిపోయామని ఒప్పుకుని, ఓటమికి పార్టీ

వున్నారు అని బిగ్గరగా హుంకరించాడట ఎన్ టి ఆర్.

అయితే మామ బెదరింపులకు అల్లుడే మాత్రం జంకలేదట. పైగా "ఈ ఆత్మవంచనే వద్దంటున్నాను, ఆత్మవిమర్శ చేసుకోండి. ఓట్లకోసం ఒక్కొక్కవీధిలో ఒక్కొక్కవేషంవేస్తే నమ్మేమూర్ఖులుకారు ప్రజలు: అసలు ముఖ్యమంత్రిగా మీరు మునిసిపల్ ఎన్నికలలో వీధివీధి తిరగడమేమిటి? వేషాలు వేయడమేమిటి? ఇంత ఖర్చుఎందుకుపెట్టాను? ఎక్కడిదీడబ్బు? దొంగఓట్లు వేయడమేమిటి? సిగ్గువేయడంలేదామీకు? మీరుచెప్పిన నీతివాక్యాలన్నీ ఏమైపోయాయి? ఇప్పటికైనా ఓ ట మి కి నైతికబాధ్యతవహించండి, అని కూర్చున్నాడట.

అప్పటికి ఎన్. టి. ఆర్. బి. జె. పి. కంటే తమకు ఎక్కువగా సీట్లువచ్చాయి కాబట్టి తమపార్టీ గెల్చిందని నచ్చచెప్పబోయాడటగాని, వెంకటేశ్వరరావు విని పించుకోలేదట.

ఈ వీధినాటకం జరుగుతున్నంతసేపు


-కొరవ 8వ పేజీలో

# పినాకినీ తీరం

## జన్మదినాలు లేని జనార్దనరెడ్డి

పుట్టినరోజంటూ ఒకటి వుంటిగాని, వివాహ జన్మదినోత్సవాలంటూ ఎరుగరు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి. ఆయన పుట్టినరోజు ఏదో నామటుకు నాకు తెలియదు. మొన్న పొరపాటున తెలిసింది ఫిబ్రవరి 20 అని.

సాధారణంగా పుత్రప్రాప్తి లేకపోయినా అధికారంలో వున్నప్పుడు జన్మదినోత్సవాలంటివి జరుపుతుంటాయి. ఆ వేడుకలో ఏర్పాటు పెట్టకపోయినా పనులేరాయుళ్ళు బయటకులాగి బ్రహ్మాండంగా చేస్తుంటారు. ప్రకాశంపంతులు వుమ్మడి మద్రాసురాష్ట్రం ముఖ్యమంత్రి అయినప్పుడు ఆయన జన్మదినం బ్రహ్మాండంగా జరిగింది; ఆయన్ను గురించిన ప్రశంసా సాహిత్యం సంగతి సరేసరి. ఆయన స్వీయచరిత్ర మొట్టమొదటగా ప్రచురితమైంది అప్పుడేనని జ్ఞాపకం. డాక్టర్ మర్రి చెన్నారెడ్డి షష్టిపూర్తి మహోత్సవం ఎంత రంగరంగవైభవంగా రాష్ట్రవ్యాప్తంగా జరిగిందీ నెల్లూరీయులకుకూడా బాగా తెలుసు. కాసు బ్రహ్మానందరెడ్డి, జలగం వెంగళరావుగారలు ముఖ్యమంత్రులుగా వుండగా వారి జీవితచరిత్రలు చాలా పుస్తకాలుగానే వెలువడ్డాయి. ఇందులో ఒకరినిగూర్చి ఒక జర్నలిస్టు వ్రాస్తే, మరొకరినిగూర్చి ఒక ఆస్థాన కవిపుంగవుడే వ్రాశాడు. భవనం వెంకట్రామ్, విజయభాస్కరరెడ్డిగారల ముఖ్యమంత్రిత్వ హయాములు అతిస్వల్పకాల వల నెలువకముందే అయిపోయి వుంటాయి. బ్యారిస్టర్‌త్వం వరకు ఎదిగిన నీలం సంజీవరెడ్డి, హరిజన ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య, [illegible] క్యాబినెట్ ముఖ్యమంత్రిగా చరిత్రకెక్కిన టంగుటూరు అంజయ్యగారల బయోగ్రఫీలుగాని, మరేదైనాగాని వెలువడ్డాయోలేదో తెలియదు!

ఎందువల్లనో నెల్లూరీయులకు ఈ జన్మదినాల పిచ్చిలేదు. నూనూగుమీసాల నవయవ్వనంలోనే మంత్రియైన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఎవరైనా పుట్టినతేదీలను తప్పకుండా అట్టే చెప్పేస్తారుగాని, తన జన్మదినోత్సవం పూసేవుండరు. ఆంధ్ర ముఖ్యమంత్రి అయినప్పుడు ఆయనకు నెల్లూరులో ఘనంగా అభినందనసభ జరిగిందికాని, జన్మదినోత్సవమంటూ జరగలేదు. ఏ. సి. సుబ్బారెడ్డిగారూ అంతే; అయితే ఆయన షష్టిపూర్తిమాత్రం హైదరాబాదులో పెద్ద ఎత్తునే జరిగింది; నెల్లూరులో జరిగిందిలేదు. ఆనం సంజీవరెడ్డి, ఆనం వెంకటరెడ్డిగారలు షష్టిపూర్తి గీతను కూడా దాటారు; కాని వారికి ఈ ఉత్సవాల వ్యామోహం వున్నట్లు నేను వినలేదు, చూడలేదు. స్వర్గీయ చెంచురామానాయుడుగారు సరేసరి- ఆయన పొగడ్తలకు పొంగేవాడుకాదు, విమర్శలకు క్రుంగేవాడుకాదు-నిర్వికారుడు! అవిధంగానే జనార్దనరెడ్డి తాను అధికార వున్నత శిఖరాన వున్నప్పుడుసైతం పుట్టినరోజు ప్రస్తావనే పెట్టుకోలేదు. ఈ సాంప్రదాయం వుత్తమమైనది, ఆదర్శమైనది అని నా అభిప్రాయం.

అసలు పుట్టినరోజు జ్ఞాపకానికిరావడం, జ్ఞాపకం చేయడంకూడా మంచిదికాదు. వయస్సు పైబడుతున్నవారికి అది గుర్తుకొస్తే మానసికమైన నిరుత్సాహానికి తెలియకుండా గురియైపోతారు. చైతన్యం తొంగిచూచే శ్రీ జనార్దనరెడ్డి 51 పూర్తిచేశాడంటే నమ్మడం కష్టమే. ఆయన మరి అన్ని ఫెళ్ళుగడపాలని, నైరాశ్యపు చీకటితెరలు తొలగి నిత్యనూతనోత్సాహంతో ప్రజాసేవారంగంలో పునః ప్రకాశించాలని నా ఆకాంక్ష.

## బక్కచిక్కిన బడుగు రైతు!



పళుతీసేశాడు; తలకుపాగా చుట్టాడు; భుజానికి పార తగిలించాడు; పొట్టి బుగ్గలతో బక్కచిక్కిన రైతువేషంలో ముఖ్యమంత్రి శ్రీ రామారావు!

## సభద్వారా మ్రోగించాడు భేరి!

శ్రీ ధనెంకుల నరసింహం పత్రిక ద్వారా ఎంతవరకు మ్రోగించగలిగాడో నేను చెప్పలేనుగాని, ప్రత్యేక సంచికావిష్కరణపేరుతో 22 తేదీ టవున్‌హాలులో ఏర్పాటుచేసిన సభద్వారా మాత్రం విజయభేరి మ్రోగించగలిగాడని చెప్పితీరాలి!

సభావిశేషాలలోకి పోయేముందు అసలు నరసింహంగారు పత్రిక ఎందుకు పెట్టారు, ఎవరికోసం నడిపారు, ఏమి సాధించారు అనే ధర్మసందేహం కలుగుతుంది. పాత్రికేయ వృత్తిలోవున్నవాడైతే అదొక వ్యసనంలే అనుకోవచ్చు; ఆయన రాజకీయవాది. పోనీ తన స్వంతరాజకీయాల ప్రచారపు మోతకు పెట్టుకున్నాడా అంటే, పాపం అదీలేదు. పోనీ పెట్టినదానికి పత్రికకు పేరు గుర్తింపు తెచ్చుకోగలిగాడా అంటే అనంగతి పాఠకులుగా మీరు చెప్పాలి.

అదేదోపిచ్చి; పాపిరెడ్డిగారు చెప్పినట్టు NRI వ్యాపారం; అచ్చతెలుగులో చెప్పాలంటే చేతిచమురు వదిలించుకునే పిచ్చిఅన్నమాట. 'విజయభేరి' నిర్వహణలో ధనెంకుల కొడుకుపంపిన అమెరికా డబ్బును దాచుకోకుండా ఈ రూపంగా ధారబోసుకున్నాడు; అంతే!

105నిమిషాలు ఆలస్యంగాప్రారంభమైనా సభ అన్నిహంగులతో వైభవోపేతంగా జరిగింది. లోటల్లా ఇద్దరు మంత్రులూ ఎగనామం పెట్టడం మాత్రమే! సాధారణంగా సాయంత్రం ఆరుగంటల సభకుకూడా టవున్‌హాలు ఈగలుముసురుకొంటుంటుంది. మధ్యాహ్నం మూడు గంటలకన్న ఈ సభమాత్రం స్వజనంతో నిండిపోయింది. స్వజనమంటే సాధారణం ధనెంకుల అభిమానకోటి అని; కందుకూరు వగైరా చోట్లనుండికూడా వచ్చినట్లున్నారు. పాటలు పద్యాల మోత, పుష్పవిలాపపుఘోష కాస్త వెగటుగానే వుంది. అతి ఎప్పుడూ రాణించదు!

పాపిరెడ్డిగారి అధ్యక్షత. సమయము సందర్భముఏమిటోమరి-ఈరోజు కార్పొరేషన్‌లో ఓడిపోయినదానికి రామారావును రాజీనామాఇవ్వమంటున్నారట; అప్పుడు అలహాబాదు హైకోర్టు తీర్పు తర్వాత "ఇందిరమ్మో- పోలేరమ్మో" రాజ్యాంగాన్నే మార్చేస్తే కిమ్మనలేదట. "ఇర్ది గారు ఏమి అనుకోకుంటే.... అనే పూర్వా

—తరువాత 10వ పేజీలో

# జమీన్ రైతు

## ప్రజల విజయం

ఫిలిప్పీన్స్‌లో అంతిమ విజయం ప్రజలదే అయింది; ఎన్నికను ఒక ప్రహసనంగావించి, వోట్ల లెక్కింపును తారుమారుజేసి, గెలుపు తనదేనని ప్రకటించుకొని, ప్రెసిడెంటుగాకూడా ప్రమాణ స్వీకారం జేసిన ఫెర్డినాండ్ మార్కోస్ ప్రజాధాటిని ఎదుర్కొనలేక చెప్పాపెట్టకుండా ప్రాణాలుదక్కించుకొని దేశంనుండి పారిపోవలసి వచ్చింది. ప్రజాబలం ముందు, వోటు ఆయుధం ముందు నియంతృత్వపు దమననీతి నిలబడలేదని ఫిలిప్పీన్స్‌లో రుజువైంది.

పోలింగు జరిగిన ఫిబ్రవరి 7 తేది మొదలు 25 తేది మార్కోస్ దేశంవిడిచివెళ్ళే క్షణంవరకు పరిణామాలు ఆసక్తిదాయకంగా, అనూహితమైన మార్పులతో అత్యంత నాటకీయంగాసాగి ప్రపంచమంతటా వుత్కంఠను కల్గించింది.

తనకు, తన అధికారానికి ఏనాడైనా ఎసరుపెట్టగలవాడనే భయంతో ప్రతిపక్ష నాయకుడైన అక్వినోను కాల్చి చంపించాడు మార్కోస్. కాని ఈనాడు అతని సతీమణి, కొరజాన్ అక్వినో, మార్కోస్ అధికారానికి మిత్తవ అయింది. వ్యక్తులను తుదముట్టించినంతమాత్రాన వారి ఆశయం, లక్ష్యం చావవు; నియంతల ఆటలు సాగవు అనేదికూడా ఫిలిప్పీన్ లో ప్రత్యక్షంగా రుజువైంది.

అవసానకాలం వచ్చేసరికి అన్నీ అట్లనే సమకూరుతాయి. ఫిలిప్పీన్స్‌లో మార్కోస్ చేసిన వోట్ల దగాకు ప్రజలు తిరుగుబాటు చేయడమేకాదు, సైనికులలో తిరుగుబాటు వచ్చింది. మార్కోస్ ఆంతరంగికులనుకునేవారిలో తిరుగుబాటు వచ్చింది; చివరకు ఎవరైతే తాను ఇంత నిరంకుశుడుగా, ప్రజాపీడకుడు కావడానికి సహాయసహకారాలందించారో, ఆ అమెరికాయే ఈనాడు మార్కోస్‌ను అధికారంనుండి వెదొలగమని సలహాయిచ్చింది; అక్వినో సతి ప్రభుత్వాన్ని మొట్టమొదటిదేశంగా గుర్తించింది. అమెరికా మూర్ఖంగా వ్యవహరించకుండా, సమయోచితవైఖరి నవలంబించి ప్రజాకంటకుడైన మార్కోస్‌కు తిలోదకాలిచ్చి, ప్రజావిశ్వాసాన్ని చూరగొన్న కొరజాన్ అక్వినో ప్రభుత్వాన్ని బలపరచడంద్వారా ఆ దేశంలో తన పరపతిని నిలుపుకొన్నది. అమెరికా ఆమర్దా అంతవరకే!

కొరజాన్ అక్వినో విధానాలు ఎట్లావుండబోతాయో, అనుభవ శూన్యురాలైన ఆమె ఏమార్గం పట్టించబడుతుందో అప్పుడే చెప్పలేము. కాని ఆమెకు ప్రతీకారేచ్ఛలేదని, ఆమెది హింసాప్రవృత్తి కాదని, దేశాభివృద్ధికి, ప్రజాశ్రేయస్సుకు ఏ విధానం అవసరమో అదే అనుసరిస్తుందని ఆమె మాటలనుబట్టి విదితమవుతున్నది. మార్కోస్ ప్రభుత్వంలోని కొందరు ముఖ్యులను తన ప్రభుత్వంలోకి తీసుకోవడంలో ఆమె సామరస్యధోరణి, సంయుక్ దృక్పథం రుజువవుతాయి. మార్కోస్‌చేతిలోదెబ్బతిన్న ఫిలిప్పయిన్స్, కొరజాన్ అక్వినో పాలనలో అన్నిరంగాలలో పునర్నిర్మాణమై పురోగమించగలదని ఆశించవచ్చు.

ప్రజాస్వామ్యాన్ని, ఎన్నికలను తమ స్వార్థంకొరకు ఒక ప్రహసనంచేయాలని తలచే నిరంకుశ రాజకీయవాదులకు ఫిలిప్పీన్స్ పరిణామం ఒక గట్టి హెచ్చరిక!



కొరజాన్ అక్వినొ



ఫెర్డినాండ్ మార్కోస్

## జమీన్ రైతు

28.2.1936

### కోయిల

మావికొమ్మను గూర్చుండి మంజుల మంజుపురుటారులు చిందును కిలకిలరవముల ప్రణయగీతాల మెలమెల్ల పాడి కొనక యెందుబోయెదు కోయిలా!

యింపులొలుక?

లలితపరిమళ కలిమా అలరుగముల గౌగలించుచుగాకలి కంఠమెత్తి పవలనక రాత్రియనకను పాడికొనక యెందుబోయెదు కోయిలా!

యింపులొలుక?

కవికుమారుల హృదయ సాగరము లందు భావవీచులు జనియించి పరువులెత్త సరస మాధుర్యగానంబు సలుపుకొనక యెందుబోయెదు కోయిలా!

యింపులొలుక?

మలయపవనుని శీత యూపులకు గవలు దలిరు గొమ్మలనూగుచు గల రవమున గ్రావ్య మంజులగానంబు సలుపకుండ యెందుబోయెదుకోయిలా!

యింపులొలుక?

-దువ్వూరు రామలింగారెడ్డి

### 50 ఏళ్ల క్రితం ఈవారం

ఈదూరు పోలారెడ్డిగారి దానధర్మాలు

ఈదూరు గ్రామమున శిథిలించియున్న చొక్కనాథస్వామివారి దేవాలయమును వేనాటి పోలారెడ్డిగారు పునరుద్ధరించిరి. ఏతత్సందర్భమున ఫిబ్రవరి 8 మొదలు 12 తేది వరకు అన్నిజాతులను మృష్టాన్నంలో తృప్తిగా జేసిరి. 12 తేదినాడు 3 పుట్ల బియ్యంతో పదివేలమంది పేదలకు అన్నదానము జేసిరి. 2000 గజముల వస్త్రదానముగూడా జేసిరి.

లోకాభిరామాయణం

రంగా ఓడారంటుండగానే ప్రకాశంపంతులు సంతోషం పట్టజాలక నవ్వారటగా! ఆనాడు శ్రీరాము పట్టాభిషేక సమయంలో లక్ష్మణస్వామి నవ్వు నవ్వులకెంత అపార్థ కల్పితమైందో ఈనాడు పంతులవారి నవ్వుకూడా అంతటి అపార్థ కల్పితమే. కాని ఆనవ్వు నిష్కారణ సమన్వితమైంది. విచారించగా, ఈ నవ్వు కాంగ్రెస్ కల్పవృక్షొన్నంతా విషపూరితం చేస్తోంది. —చిత్రగుప్తుడు.

# పవర్ లూం కార్మికులు ఆకలి మంటలకు ఆహుతి కావలసిందేనా?

శ్రీలంక కాందిశీకుల పునరావాసం కోసం వేదాయపాళెంలో కట్టిన పవర్‌లూం ఫ్యాక్టరీ మూతపడి పదినెలలైంది. దాదాపు 150 మంది కాందిశీకులు ఉద్యోగాలు కోల్పోయి, వీధుల్లోపడి, ఆకలితో అలమటిస్తున్నారు. ప్రభుత్వానికి ఎన్నిసార్లు మొరపెట్టుకున్నారో లెక్కలేదు. మన మంత్రికి చెప్పారు, గవర్నర్‌కు విన్నవించారు, ధర్నాలుచేశారు, నల్ల బ్యాడ్జీలతో ఊరేగింపులు చేశారు. కాని ఎవరూ వీరిగోడు విన్పించుకోవడంలేదు.

కోటిరూపాయల ఖర్చుతో కట్టిన ఫ్యాక్టరీని ఇట్లా పాడుపెట్టడం, 150 కుటుంబాలను ఆకలికి ఆహుతిచేయడం దారుణం. ఈ పరిస్థితులలో కాందిశీకులందరూకలసి,తమసమస్యల పరిష్కారం కోరుతూ రక్తంతో సంతకాలుచేసిన వినతిపత్రం పంపాలని, రెవిన్యూమంత్రిని ఘెరావ్‌చేయాలని, నగ్నంగా వీధుల్లో భిక్షాటనచేసి, వచ్చినడబ్బు ప్రభుత్వ ఖజానాకు జమకట్టాలని నిర్ణయించారు. పరిస్థితి ఇంతతీవ్రంగాకమునుపే ప్రభుత్వం కళ్ళుతెరచి, వీరి మొరాలకించి, వీరికి ఉద్యోగాలు ఇప్పిరిగి ప్పించడం బాగుంటుంది.

నెల్లూరు -ఎం. రాధయ్య,
అధ్యక్షుడు, ఐ.ఎన్.టి.యు.సి.

### బాగా బుద్ధిచెప్పారు!

హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలలో ఓటర్లు మిత్రపక్షాలకు బాగా బుద్ధిచెప్పారు. ఉభయ కమ్యూనిస్టులు, బి జె పి, జనతా పార్టీలు నిన్నమొన్నటివరకు తెలుగు దేశాన్ని నెత్తికెక్కించుకున్నాయి. ఈ రోజు వారిలో వారికి చీలికలురాగానే ఒకరినొకరు అసభ్యంగా తిట్టుకుంటున్నారు. తెలుగు దేశాన్ని ఆకాశానికెత్తిన నోటితోనే, అదే పార్టీని దుమ్మెత్తిపోస్తుంటే, ప్రజలు ఛీకొడతారన్న ఇంగితంకూడా లేనట్లుంది. నైతికవిలువలకు గడ్డిపోచంత విలువకూడా ఇవ్వని ఇటువంటి పార్టీలకు నగర ఓటర్లు గట్టిగా గుణపాఠం చెప్పారు. ఇప్పటికైనా ఈనాయకులు, తాము ఏమి చెప్పినా నమ్మేమూర్ఖులు ప్రజలనే అంధవిశ్వాసాన్ని విడనాడితే బాగుపడతారు.

విశాఖపట్నం -పి. కృష్ణమూర్తి

### కొండయ్య విగ్రహం నెలకొల్పండి

రాజకీయవాదిగానేకాక, మేధావిగా



కూడా రాష్ట్రప్రజలందరికే సుపరిచితులైన స్వర్గీయ బి. సి. కొండయ్య మృతిచెంది సంవత్సరం గడచిపోయింది రాజకీయాలకు అతీతంగాచూస్తే కొండయ్యగారు చక్కని రచయితగా, వక్తగా ఎంతోమంది అభిమానం చూరగొన్నారు. అటువంటి నాయకుడిని నెల్లూరీయులు శాశ్వతంగా గుర్తుపెట్టుకునేటట్లు ఏదో ఒక ఏర్పాటు చేయడం సమంజసం.

ఇందుకుగాను కొండయ్యగారి కాంస్య విగ్రహం నెల్లూరులో ఒక ప్రధాన కూడ

—కొరవ 8వ పేజీలో

# జిల్లాపరిషత్తు పరీక్షలలో అంధులకు అన్యాయం జరిగిందా?

జిల్లాపరిషత్ నిర్వహించిన స్పెషల్ టీచర్ పోస్టుల వ్రాతపరీక్షలలో, అంధ అభ్యర్థులకు అన్యాయం జేగారట.

అంధులైన విద్యార్థులు సాధారణ పరీక్షలు బ్రెయిలీ లిపిలో వ్రాస్తారు; అయితే, ఇటువంటి ఉద్యోగార్థ పరీక్షలకు బ్రెయిలీలిపి అనుమతించరు. దానికి బదులుగా 'స్క్రైబర్స్'ను నియమించడం సాంప్రదాయమట. స్క్రైబర్స్ అంటే. అంధ అభ్యర్థులకు ప్రశ్నాపత్రం చదివి వినిపించి, వారుచెప్పే జవాబులను వ్రాసే వారట. ఇటువంటి పరీక్షకు స్క్రైబర్స్‌ను నియమించాలని ప్రభుత్వ ఉత్తర్వుకూడా వుందట.

అయితే జి. ప. అధికారులు తమకు ఆ సౌకర్యం కల్పించడానికి నిరాకరించారని, పైగా మీరు టీచింగ్‌కు అనర్హులని అవమానించి తిప్పిపంపేశారని కొందరు అంధులు లబోదిబో మంటున్నారు.

కడప, చిత్తూరు, హైదరాబాదులలో ఇటువంటి పరీక్షలకు అనుమతించారట. అక్కడ వీలైంది, ఇక్కడెట్లా వీలు కాకుండా పోయిందన్నది వీరి ప్రశ్న!

జి. పి. ఓ. గారు, స్వయంశక్తిపై ఆధారపడాలని ఉత్సాహపడే వికలాంగులను ఉత్సాహ పరచాలి; నిరుత్సాహ పరచడం దారుణమైన నేరమౌతుంది.

## నెల్లూరు సంగతులు

### కళా భారతి మిమిక్రీ

కళాభారతి సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో టౌనుహాల్‌లో ఒక మిమిక్రీ కార్యక్రమం ఏర్పాటు చేసింది. జాషువా, బాలరాజు, హేమసుందర్ అనే ముగ్గురు యువ కళాకారులు ప్రేక్షకులను నవ్వులతో ముంచెత్తారు. డాక్టర్ పి. శ్రీనివాసులురెడ్డి శ్రీ జాషువాకు కళాభారతి తరపున మెమెంటో ఇచ్చారు; సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎం. శంకరప్రసాద్ స్వాగత వందనాలు చెప్పారు.

### రోటరీ ప్రసంగం

నెల్లూరు నార్త్ రోటరీక్లబ్ ఇటీవల రెడ్‌క్రాస్ భవనంలో క్షయవ్యాధిపై ఒక ఉపన్యాసం ఏర్పాటుచేసింది. జిల్లా టి. బి. కంట్రోలు ఆఫీసర్ డాక్టర్ టి. వి. వెంకటేశ్వర్లు మాట్లాడారు. ఇప్పట్లో టి. బి. ని నయంచేయడం చాలా సులభమని, భయపడవలసిన అవసరంలేదని ధైర్యంచెప్పారాయన.

### లారీ ఓనర్ల సంఘం

నెల్లూరుజిల్లా లారీ యజమానుల సంఘానికి నూతన కార్యవర్గం ఎంపికైంది. అధ్యక్షుడుగా శ్రీ పి. గోపాల్ నాయుడు, ఉపాధ్యక్షులుగా ఎ. దశరథ రామయ్య, ఎస్. పెంచలయ్య. కార్యదర్శిగా కె. చంద్రశేఖరరెడ్డి, సహాయ కార్యదర్శులుగా టి. రామారావు,

–తరువాయి 10వ పేజీలో

జయభారత్ హాస్పిటల్‌కు ఢిల్లీ-దీనదయాళ్ ఇన్‌స్టిట్యూట్ బహూకరించిన అంబులెన్సు పూజాపునస్కారాలతో ప్రారంభోత్సవం జరుపుతున్న సామంతు గోపాలరెడ్డి (క్రింది చిత్రంలో కుడివైపు వ్యక్తి).–పై చిత్రంలో సభావేదిక మీద ఎడమ నుండి వరుసగా–స్వామి మహేశానంద, గోరంట్ల రాధాకృష్ణ, సి. కె. శుభప్రద, జె. వి. రెడ్డి, మారంరెడ్డి రామరాఘవరెడ్డి.

# ఇప్పుడు ఒక దేవేంద్ర భవనం కలెక్టరు మీటింగు హాలు!

చాలాకాలంగా కలెక్టరుకాన్ఫరెన్సులు కలెక్టరు రూములోనే జరుగుతూ వుండేవి ఒక్కొకలెక్టరు తన తాపేదార్లను మీటింగులో తిట్టే తిట్లకు ఆ రూము నాలుగు గోడలు ఎంతో బాధపడేవి. ఇప్పుడు ఈ గోడలకు ఆ బాధ తప్పింది. మీటింగుహాలు ప్రత్యేకంగా నిర్మించారు.

కలెక్టరాఫీసు వెనుక భాగాన 1979 తుఫాను సొమ్ములో ఖర్చుకాగా మిగిలిన దానితో ప్రభుత్వ అనుమతి పొంది, "సైక్లోన్ స్టోర్సు బిల్డింగు" కట్టారు. ఈ భవనానికి పైన మీటింగుహాలు కట్టారు.

## పాతకు స్వస్తి- కొత్తకు స్వాగతం

ఈ మీటింగుహాలు తన అందాన్ని చక్కగానే దిద్దుకుంది. ఒక మినీ అసెంబ్లీ హాలులా రూపొందింది. వందమందిని తనలో యిముడ్చుకోగలదు.

మీటింగుకుహాజరైన అధికారులుగాని, అనధికారులుగాని కూర్చునేందుకు దీర్ఘ చతురస్రాకారంలో మధ్యజాగావదిలి రెండడుగుల వెడల్పున సన్‌గ్లాస్ టేబుల్స్ ఇరువైపులా అమర్చారు. చుట్టూ ఫోముకుర్చీలు వేశారు. కలెక్టరుగాక మరిద్దరు ఉన్నతాధికారులు అటూ ఇటూ కూర్చునేందుకు మెత్తని ఎత్తయిన ఆసనాలు, కలెక్టరుటేబులుపై మూడుమైకులు, మూడు ఎలక్ట్రానిక్ కాలింగ్ బెల్సు. మీటింగుకు హాజరైనవారు మాట్లాడేందుకు వారి టేబులుపై అక్కడక్కడా తొమ్మిది మైకులు, ఆ మైకులో ఎలా మాట్లాడాలో తెలిపే సూచనలతో అచ్చు

–తరువాయి 10వ పేజీలో





# పద్యాలు - గేయాలు

## జీర్ణమంగే సుభాషితమ్

'రసిక్'

కవినిగదా అని ఏదైనా చెప్పవస్తే
కరవొస్తుంది లోకం!
కన్నుమంటున్నది లోకం!
"ఈస్టారు వార్సు యుగంలో
ఐశ్వర్యుల నాటి భావాలా, నీవు!
ఊరకుంటే ఊరాపేరా అని
ఊరక వదరుతుంటావు.
ఊరుకో! కవీ! ఊరుకో!
వేమన నీతులకు, విదుర నీతులకూ
బెల్లం నెయ్యి కలిపి వడ్డించి తినమంటావు
మ్రింగుడు పడక, మ్రింగినా అరక్క
మేమంతా ప్రత్యామ్నాయంగా పసందైన
'మెనూ'ను రూపొందించుకున్నాము
"అర్థించో, అరువుతెచ్చుకొనో,
అపహరించో"
మా పొట్టను మేము నింపుకొంటున్నాము
మాపాట్లు మేము పడుతున్నాము
మరి, మధ్యలో అడ్డంరాకు
"ఆవు, గడ్డి, కుక్క"సామెత గుర్తుకుతేకు
ఊరుకో, కవీ, ఊరుకో!
ఉపదేశాలు మానేస్తానే, మీ
ఉల్లాసం కొలకు కవిత
వినిపిస్తాను, వినమంటున్నావా
"ఓ పిచ్చికవీ! నిన్నుజూస్తే
ఒకటే జాలివేస్తోంది మాకు
కావ్యానందం బ్రహ్మానంద సహోదరమని
కవికి, కవితకు దండంపెట్టేరోజులు
గతించాయి
కళ్ళుమూసుకొని కవితలల్లుతూ కూర్చోక
కళ్ళు తెరచిచూడు నీచుట్టూవున్న
ప్రపంచాన్ని
చూడు ఈ మూవీలను, ఈ టీవీలను
చూడు ఈ సిటీలను, ఈ మల్టీస్టోరీలను
చూడు ఈ పంచనక్షత్రాల హోటళ్ళను
ఒక్క బ్రహ్మకే కాదయ్యా
హరిహరులు, దిక్పాలకులూ,
ప్రజాపతులు,
మనువులు వగైరా మందిమార్బలానికంతా
కావలసినంత, వెక్కసమయ్యేటంత
ఆనందాన్ని చేకూర్చే మసాలాదినుసులు
ఇలపై ఈనాడు ప్రోగుపడి
వున్నాయి చూడు
ఇంత అందాల ఆనందాల రోజులు
వస్తాయని
ఎవడైనా ఒక్కకవి చెప్పగలిగేడా?
ఎందుకూ మీకు త్రికాలవేత్తల
మన్న బిరుదు?
అందుకే ఊరుకో మంటున్నాం నిన్ను
మాతో కలిసి పొమ్మంటున్నాం నిన్ను"
కలిసి పోలేను వాళ్ళతో
కవితను వదలుకోలేను
నెమ్మదిగా గొణుక్కుంటున్నానిలా
"జీర్ణమంగే సుభాషితమ్"

• • •

## ఎలక్షన్

హైదరాబాదు
నగరపాలక ఎన్నికలు
నమ్ముచేశాయి
తెలుగుదేశం కన్నకలలు
వేషాలుమార్చే వ్యాపారంలో
దోషాన్నెత్తుకుంటూంది జనత
కాషాయాంబరాల వెనుక
కనుమరుగయిన రహస్యాన్ని
కనుగొంటేచాలు అదే ఘనత:
పెరిగింది మజ్లీస్
కాంగ్రెస్సైల ప్రతిష్ఠ!
ఏలినవారి తిరోగమన
రాజకీయాలకది పరాకాష్ఠ!!

–వేపకొమ్మ

• • •

స్మగ్లింగ్ కొందరి నేరప్రవృత్తి
రిగ్గింగ్ మనజాతి సంస్కృతి
కుటిల రాజకీయ దమననీతి
జన జీవితానికి ఇది హేయమైనప్రీతి

అవినీతిని కడగాలన్నా
అధర్మాన్ని శుద్ధిచేయాలన్నా
అవసరంలేదు 'ఫినాయిల్'
ఆత్మవిమర్శే ఓ 'ఫ్యూయల్'

–టి. జాన్‌లైజ్

• • •

## ముసుగు

అయ్యోయ్ కమ్యూనిస్టులు!
అయ్యయ్యోయ్ మార్క్సిస్టులు!
భవితవ్యాన్ని భూతమని
భయపడే మీరు
పోరాటపుగోదాలో ఎందుకుదూకారు?
ఎర్రజెండాలో ఒదగాల్సిన మీరు
ఎర్రజెండా పట్టి
పచ్చజెండా క్రింద పొదగేసి
తల్లి తలదీసిన తనయులు మీరు–
మీకెందుకు ఎర్రజెండా!
కరుడుగట్టిన మీగుండెల
మసిపూసిన నల్లజెండాను
నింగిలో నిగనిగలాడేలా
ఎగురువేయండోయ్!
ఎర్రజెండా ముసుగు
తీసివేయండోయ్!
ముసుగులో గుద్దులాట
మానివేయండోయ్!

–పృథ్వి

# చక్కెర ఫ్యాక్టరీ విజయం రైతులదే!

మనరాష్ట్రంలోనేకాదు, ప్రపంచంలో ఎక్కడాలేని 'గ్రేడింగ్' సమస్యను మేనేజింగ్ డైరెక్టరు శ్రీ అరుణకుమార్‌గారి గొంతులో దాచిపెట్టుకుంటా గొర్రెల నరకు తెచ్చినా అంతిమ విజయం రైతులదే అయింది. కోవూరు సహకార చక్కెర కర్మాగారం- చెరకు రైతులదే. చెరకు రైతులకోసం, చెరకు రైతు ప్రతినిధులచే నిర్వహింపబడవలసిన సంస్థ. అటువంటి ఫ్యాక్టరీ నిధులనుండి వేతనం తీసుకునే అధికారి రైతులమీద నిరంకుశంగా పెత్తనం చెలాయించడమనేది ఏర్పాటను, చక్కెర సమస్యలు క్షుణ్ణంగా తెలిసిన రాష్ట్ర నాయకులతో ఒక పెద్దకథ జరిపి 'గ్రేడింగ్' అనేది ఎక్కడా లేదని చెప్పించినా ఫలితం లేకపోయింది; ముఖ్యమంత్రి శ్రీ రామారావు గారి వద్దకుపోయి 'గ్రేడింగ్'లో అమలు జరపవద్దని ఆదేశాలిప్పించినా పెడచెవిన పెట్టబడింది: ఎం. డి. గారు చెరకు రైతులను చీల్చి కరపత్రాల యుద్ధంతో పరిపాలించడానికి ప్రయత్నించడానికాని, సామరస్య వైఖరిని ప్రదర్శించలేకపోయారు. మేనేజింగ్ డైరెక్టరు అరుణకుమార్‌గారి మొండితనం, ఇటు ధర్నా గురించుమంత రైతులు వినాదాలు, అటు ఫ్యాక్టరీ యాజమాన్యం నుండి అధికార ప్రకటనలు. ఉద్రేకాలు పెరిగిపోతున్న సమయంలో 22 తేదీ శ్రీ ఎం. వెంకయ్యనాయుడు కదపకపోరూ అక్కడ ఆగి, రైతులతో సంప్రదించి. ఆ తర్వాత ఫ్యాక్టరీ ఆఫీసులో వున్న కలెక్టరుగారితో మాట్లాడి, ఇద్దరూ ఉద్యమకారులను కలుసుకొని పరిష్కారానికి మార్గాన్ని ఏర్పరచారు. ఆరోజు అనుకున్నప్రకారం మరురోజు కలెక్టరాఫీసులో సమావేశం జరిగింది; వెంకయ్యనాయుడుకూడా పాల్గొన్నారు.

ఆ సమావేశంలో గ్రేడింగు వుండబోదని, చెరకుతోవచ్చిన ఏ వాహనమూ

—కొరవ 7వ పేజీలో

## ఎం. డి. బదలీ?

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ అరుణ కుమార్‌ను వెంటనే బదలీ చేయవలసిందిగా ముఖ్యమంత్రి ఆదేశాలు జారీచేసినట్లు శాసనసభ్యుడు శ్రీ ఆనం రామనారాయణరెడ్డి ద్వారా తెలుస్తున్నది. గ్రేడింగు విషయంలో ప్రభుత్వ ఆదేశాలను ధిక్కరించడమే ఈ బదలీకి కారణమంటున్నారు.

గ్రేడింగువిషయంలో అంతకు ముందు ముఖ్యమంత్రి కార్యదర్శి శ్రీ రాఘవేంద్రరావు నుండి కలెక్టరుకు రెండుసార్లు టెలిఫోన్ ఆదేశాలు వచ్చినట్లు, అవి అమలు జరగనట్లు తెలుస్తున్నది.

ప్రస్తుతం కలెక్టరు జన్నత్ హుసేన్, ఎం. డి. శ్రీ అరుణ కుమార్ హైదరాబాదులోనే వున్నారట.

కవిత్రయ జయంతులలో 17 తేదీ తిక్కన కవితాశిల్పంపై ఉపన్యసించి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారినుండి సన్మానం స్వీకరిస్తున్న డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు ఎడమవైపు వర్ధమానసమాజంఅధ్యక్షులు ఎం.సుందరాచారి

విపరీతము అవుతుంది. ఇక్కడ మరో కొలనీయమైన అంశం కలెక్టరు శ్రీ జన్నత్ హుసేన్ ఫ్యాక్టరీ ఛైర్మన్‌గా రైతుల సమస్యను సరైన కోణంనుండి అవగాహన చేసుకొని, ప్రత్యక్ష ఆందోళనకు అవకాశమివ్వకుండవలసిందిపోయి, అధికార

### మా విలేఖరి

మనస్తత్వంతో అధికారిమాటలనే నమ్మి దాన్నొక సమస్యను చేయడం కొంచ నీయమే!

గ్రేడింగు రద్దుకు చెరకు రైతులు ఫ్యాక్టరీ క్రషింగ్ ప్రారంభించినప్పటి నుంచి ఆందోళన చేస్తూనేవున్నారు. ఎం. డి., కలెక్టరుతో జరిపిన రాయబారాలు సత్ఫలితాన్నివ్వలేదు; చెరకు- కలెక్టరు- ఫ్యాక్టరీ ఛైర్మన్ శ్రీ జన్నత్ హుసేన్ నిస్సహాయవైఖరితో రైతులకు 'ధర్నా' ఆందోళన కార్యక్రమానికి పూనుకోవడం తప్ప గత్యంతరం లేకపోయింది.

చెరకు రైతులు పార్టీ, వర్గ విభేదాలు విస్మరించి ఫ్యాక్టరీ మాజీఛైర్మన్ శ్రీ మేనకూరు బాలకృష్ణారెడ్డి ప్రభృతుల అధ్యక్ష్యంలో 19 తేది నుండి ఫ్యాక్టరీవద్ద ధర్నా ప్రారంభించారు: ఫ్యాక్టరీలోకి చెరకుతో వచ్చిన ఏ వాహనాన్ని కూడా తిప్పిపంపబడాకుండానిరోధించారు. రోజురోజుకు రైతుల్లో పట్టుదల పెరగడం, ఉద్యమం ఉధృతంకావడం జరిగింది. కలెక్టరుగారు మధ్యవర్తిగా వ్యవహరించి రైతులతో ఈ ఉద్యమాన్ని విరమింపచేయవలసిందిపోయి, ఎం. డి. తో చేరి ప్రతిష్ఠాసమస్యగా తీసుకున్నట్లున్నారు.



# ఓజిలిపై మంత్రి కెందుకింత ప్రేమ?

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డిగారికి ఓజిలి పై అవ్యాజానురాగం పెరిగిపోతూంది. జిల్లాలో ఏ కొత్త పథకం మంజూరైనా, అది ఓజిలికి తరలింపబడేదాకా ఊరుకోవడంలేదాయన.

ఈ మధ్యనే ఓజిలికి ఎన్ని సౌకర్యాలు సమకూరాయని? బాలుర హాస్టల్ పెట్టారు: ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఏర్పాటైంది: హైస్కూలు తెరిచారు: అన్నిటికీ మించి మండలకేంద్రంచేశారు. ఇవిచాలక. ఇటీవలే, వెంకటగిరికి ఒక బాలికల హాస్టల్ మంజూరైతే దాన్ని కూడా ఓజిలిలోనే పెట్టాలని మంత్రి ఒత్తిడి చేస్తున్నాడట అధికారులను.

ఓజిలిలో వుండేది ఒక్కటే ఒక్క హైస్కూలు. అందులో విద్యార్థినుల సంఖ్య పట్టుమని పాతికకూడా వుండదు. వెంకటగిరిలో విద్యార్థినుల సంఖ్య వెయ్యికి పైమాటే. పైగా తాలూకా కేంద్రం. కాలేజి వుంది. అన్నిటికీమించి భవనంవంటి వసతులు వెతుక్కోనవసరం లేదు. ఇన్ని సౌకర్యాలను వదలిపెట్టి, ఓజిలికి ఈ హాస్టల్ తరలించడంలో మంత్రికి జరిగే మేలేమిటో మనకర్థం కావడంలేదు.

ఓజిలి మాజీ గ్రామాధికారి శ్రీ వల్లూరు ప్రకాశం మంత్రిగారికి ఈమధ్య కుడిభుజమే అయ్యారు: ఆయన ప్రీత్యర్థం చేస్తున్నపనులా ఇవి? లేక మంత్రిగారిలో నియోజకవర్గమార్పు ఆలోచనలేవైనా అంకురిస్తున్నాయా?

### ఫ్యాప్టో సభ్యత్వం

రాష్ట్ర టీచర్లసంఘాల సమాఖ్య 'ఫ్యాప్టో' ఫెడరేషన్ కౌన్సిల్ సభ్యుడుగా నె. జి. టీచర్స్ ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ కె. గాలయ్య ఎన్నికైనారు. నెల్లూరు ఫ్యాప్టో కన్వీనరుగాకూడా ఆయన నియమితులైనారు.

### పెంచలకోన నేత్రశిబిరం

నెల్లూరు లయన్స్‌క్లబ్ మార్చి 4 నుండి 9 వరకు ఉచిత వైద్యశిబిరం నిర్వహిస్తూంది. రోగులకు మందులు, ద్దాలు, ఆహారం ఉచితం. డాక్టర్ కె. వేణుగోపాలాచారి ఆపరేషన్లు చేస్తారు.

### మర్రిపాడులో ఎమ్మెల్యే

ఉదయగిరి ఎమ్మెల్యే శ్రీ ఎం. రాజమోహన్‌రెడ్డి, సమితి అధ్యక్షుడు శ్రీ ఎం. వి. నారాయణరెడ్డితో కలిసి ఇటీవల మర్రిపాడు మండలంలో పర్యటించారు. వెంకటంపేట, నందవాము, కంపసముద్రం స్కూలుభవనాలకు శిలాన్యాసు చేసి, ఇర్లపాడు, ఇన్నపల్లె పాఠశాలభవనాలకు, రాజులపాడు మంచినీటి పథకానికి శంకుస్థాపించారు. పొంగూరులో హైస్కూలు స్థాపనకు ఎమ్మెల్యే 12,500 విరాళం ప్రకటించారు. చివర్న ధర్మారావుచెరువు

### జిల్లావార్తలు

పల్లెలో బహిరంగసభలో మాట్లాడారు.

### కావలి అభినందన

కావలి మునిసిపల్ ఛైర్మన్ శ్రీ చక్కా సత్యనారాయణగుప్త ఇటీవల విదేశాలు పర్యటించి వచ్చిన సందర్భంగా కావలి వైశ్యసంఘం ఆయనను ఘనంగా అభినందించింది. నెల్లూరుజిల్లాపేరును పొట్టి శ్రీరాములుజిల్లాగా మార్చాలని, లేకుంటే తాను సత్యాగ్రహం చేస్తానని శ్రీ సత్యం భీష్మప్రతిజ్ఞచేశారు. సభలో ఎన్. ఆర్. కుమారస్వామి, కె. నాగరాజారావు, సి. వి. ఎస్. శర్మ, సుందరరామశర్మ తదితరులు మాట్లాడారు.

### తల్లీబిడ్డల హత్య

కొండాపురం మండలం, రేణుమాల గ్రామానికిచెందిన ఎరుకలయ్య అనే మనుష్యరూప రాక్షసుడుతనభార్యసామ్రాజ్యం(30)ను రెండేళ్ళబిడ్డతోసహా బావిలోకిత్రోసిచంపాడట. భార్యశీలంపై శంక ఈ దుర్మార్గానికి తనను పురికొల్పిందని తర్వాత అతడే పోలీసులదగ్గర ఒప్పుకున్నాడట.

### సూపర్‌బజార్ డైరెక్టర్లు

గూడూరు సూపర్‌బజార్‌కు శ్రీ కె. ఎస్. వి. ప్రసాద్ అధ్యక్షుడుగా ఎన్నికైనారు, డైరెక్టర్లుగా శ్రీయుతులు ఇంతియాజ్ హుసేన్, వై. ప్రభాకరరావు, పెళ్లా మోహనరెడ్డి, పుగ్గుటూరు రవీంద్రరెడ్డి, కొండూరు రామరాజు, వెదనపర్తి శ్రీనివాసులురెడ్డి ఎన్నికైనారు.

పేరుకు పాతికేళ్ళనుంచి వుండేతప్ప, ఈ సూపర్‌బజార్ చిరునామాకూడా

—కొరవ 7వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

**విమర్శకుడు**

## శ్రీనివాసులురెడ్డి

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి 1 తేది ఉదయం నెల్లూరు స్టేషన్: ప్రజాభినందన సమావేశంలో పాల్గొని రాత్రికే తిరిగివెళ్లారు.

## సంపూర్ణ బంద్

26 తేది భారత్ బంద్ నెల్లూరులో సంపూర్ణ గా జరిగింది. అఖిలపక్ష విప్లవ కారణంతో ఒక్కొక్కపార్టీ ఒక్కొక్క ప్రాంతాన్ని పంచుకుని, పోటా పోటీగా బలప్రదర్శనలు జరిపారు. ఉదయం అరగంటలోనే ట్రాఫిక్ బంద్. రిక్షాలు కూడా తిరగనివ్వలేదు; సాయంత్రంవరకు అదేపరిస్థితి.

రైల్వేవిషయంలో మాత్రం బంద్ నిర్వాహకుల ఆటలు చెల్లలేదు. ఉదయం 9 గంటలకు మద్రాసుకు వెళుతున్న తమిళనాడు ఎక్స్‌ప్రెస్‌ను నిలిపి, ఇంజన్‌పై దాడిచేశారు. రైళ్ళకు దెబ్బలుతగిలాయి ఈలోగా పోలీసు వచ్చి, ట్రైవరునుఅప్రమత్తంచేసి రైలుకు దారివదిలారు. తిరిగి మధ్యాహ్నం కలకత్తాకువెళ్ళే కోరమాండల్ నిలిపారు కాని, అదికూడా గంటతర్వాత బయల్దేరి పోయింది.

టౌన్‌లో ఎక్కడా అల్లర్లు అరెస్టులు లేవు. సూళ్ళూరుపేటలో మాత్రం పార్టీ వర్కర్లను అటకాయించిన 30 మందిని అరెస్టు చేశారు.

## బైరాగిమఠం స్థలం స్వాహా జరిగిపోయింది!

బైరాగిమఠం స్థలం. స్వాహా జరిగిపోయింది. దాదాపు అరకోటి చేసే బంగారంటి భూమిని ముష్టి నాలుగు లక్షలు కట్టించుకుని దేవాదాయశాఖ అధికారులు రిజిష్టరు చేసేశారు. 10 తేది గుట్టు చప్పుడు కాకుండా జరిగిపోయింది తతంగం.

అధికారులు చాలాతెలివిగా నడిపారు ఈ స్వాహాకార్యాన్ని! మల్లికార్జునం అనేవ్యక్తికి ఎకరం రెండున్నరలక్షకు అమ్మడానికి అనుమతిస్తూ వెలువడిన జి.ఒ.ను పత్రికల అలజడి తర్వాత ప్రభుత్వం నిలిపివేసింది. ఆ మల్లికార్జునం, దీనిపై హైకోర్టులో రిట్ దాఖలుచేశాడట. ప్రభుత్వ న్యాయవాది, ఈ నిలుపుదలకు కారణమేమిటో తనకు తెలియదని, అందుకు సంబంధించిన రికార్డులు, సమాచారం తనదగ్గర లేవని చెప్పాడట. ప్రతికూలత లేకపోవడంతో కోర్టు, పల్లిగ్గనంకు అనుకూలంగా ఉత్తర్వులిచ్చినట్టుంది. దాన్ని ఆధారం చేసుకొని అధికారులు తక్షణం స్థలం రిజిష్టరు చేశారు.

ఎంతఘోరం? ఎంత బరితెగింపు? ఎంత నిర్భీతి? ఈ విక్రయం అన్యాయమంటూ పత్రికలుచేసిన అలజడి, ప్రజల ఆందోళన, కలెక్టరుహామీ అన్నిటినీ గడ్డిపోచ క్రింద తీసిపారేసి, అధికారులు ప్రజల ఆస్తిని పరులపాలు చేశారంటే ఏమనుకోవాలి? ఇంతటి ప్రజాందోళనను తిరస్కరించడానికి వారికెంత ధైర్యం? ఎంతపెద్ద నాయకుల అండలేనిదే, ఇంతటి పట్టపగలు దోపిడీకి సిద్ధపడతారు? అవినీతికి తన ప్రభుత్వంలో స్థానంలేదని అన్నగారు పలికిన ఉత్తరకుమార ప్రగల్భాలన్నీ ఏమైపోయాయి? ఛీ.. ఛీ.. ఇంత సిగ్గులేని ప్రభుత్వం మనకెట్లా దాపురించిందండీ?

## ఎస్. పి.

ఎస్. పి. శ్రీ ఆర్. ఆర్. గిరీష్ కుమార్ శిక్షణ నిమిత్తం హైదరాబాదు వెళ్ళారు. ఒకటిన్నర నెల వుంటుందట. గుంటూరు డి. ఐ. జి. శ్రీ రామస్వామి ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తున్నారు.

గిరీష్‌కుమార్‌గారు శిక్షణ తర్వాత సి. బి. ఐ. కి బదలీ కావచ్చునంటారు.

## "హరిణి" పునర్దర్శనం-బహుపరాక్!

రెండేళ్ళు గడచిపోయిందికాబట్టి ప్రజల స్మృతిపథంనుండి మరుగైవుంటామనే భ్రమతోకాబోలు హరిణి సాంస్కృతిక సమాఖ్య పేరుతో "ఆలిండియా కల్చరల్ ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్" అంటూ మళ్ళీ రంగప్రవేశం చేస్తున్నారు శ్రీమాన్ వి. మధుసూదనరెడ్డి!

గతపర్యాయం (1984) లో 30 రోజులపాటు నిర్వహించారట; ఈసారి 45 రోజులట; రాండహో అంటూ పిలుస్తున్నారు పాత మధుసూదనరెడ్డి. కొత్త ప్రొఫెసర్ కె. నాగరాజు. ఈసారి ఎగ్జిబిషన్ ఏ. సి. స్టేడియంలోనట. ప్లాన్లు గిన్లు, రేట్లు గిట్లు, ప్రచారార్భాటాలు గిర్భాటాలు ఆడంబరంగానే వున్నాయి. గతపర్యాయం ప్రారంభోత్సవమని ప్రకటించిననెలరోజులతర్వాతనామావశిష్టంగా ప్రారంభింపామనిపించారు; ఈసారి మార్చి 1 తేదినుండి ఏప్రిల్ 15 తేది వరకు జరుగుతుందని ప్రకటన; ఫిబ్రవరి 28 తేదినాటికి అక్కడేమీ కనబడలేదు; ఏమి ప్రారంభోత్సవం చేస్తారోమరి!

హరిణి పేరుతో 1982, 83 ప్రాంతంలో అనేక వ్యాపారాలు జరిగాయి; అనేకమంది మునిగారు. 1984 లో ఎగ్జిబిషన్ ఎత్తుగడ విఫలంకాగా అనంతం నిర్వాహకులిద్దరూ నెల్లూరువదలివెళ్ళారు.

అందులో ఒకాయన అడ్రసు తెలియదు; ఇంకొకడు- మధ్యలో ఎక్కడనుంచో దినపత్రికలలో 'హరిణి' లావాదేవీలతో తనకేమీ సంబంధంలేదని ఒక ప్రకటన చేసినట్టుగుర్తు. పునః ప్రవేశానికి అవకాశం కల్పించుకోడమో. మరేమిటో ఆ ప్రకటన ఉద్దేశ్యం మనకు తెలియదు.

ఏమైనా హరిణి సాంస్కృతికసమాఖ్య ఎన్నడూ ఒకచిన్న సాంస్కృతిక కార్యక్రమాన్ని నిర్వహించలేదు; అది ఒక వ్యక్తిచేతి సంస్థ- నిస్సందేహంగా- దేశస్థాయిలో ఒక ఎగ్జిబిషన్ ఏర్పాటుచేసే స్తోమత. సమర్థత ఆ సంస్థకుగాని, దాని 'మేనేజింగ్ ట్రస్టీ' కి గాని లేవు.

అందువల్లనే హరిణి గ్జిబిషన్ అంటే బహుపరాక్ చెప్పవలసివస్తున్నది. ఇక మీ ఇష్టం!

## కనిగిరి రిజర్వాయరు-కరవమంటే...!

కరవమంటే కప్పకుకోపం. విడవమంటే పాముకుకోపం అంటారే, కొన్ని విషయాలు ఆవిధంగా సందిగ్ధంగా తయారవుతాయి.

—కొరవ 7 వ పేజీలో

# దౌర్జన్యరూపం దాల్చిన లెక్చరర్ల సమ్మె

రాష్ట్రవ్యాప్తంగా జరుగుతున్న కాలేజి లెక్చరర్ల సమ్మె నెల్లూరుజిల్లాలోకూడా దిగ్విజయంగా జరిగిపోతూంది. పరీక్షలు వాయిదా పడతాయనే సంబరమో. ట్యూషన్లలో పెరిగిన అనుబంధాలమహిమో కాని, అన్నికాలేజిలలో విద్యార్థులుకూడా లెక్చరర్లకు మద్దతు పలుకుతున్నారు.

వి. ఆర్. కాలేజిలో విద్యార్థుల ప్రమేయంవల్ల సమ్మె దౌర్జన్యరూపందాల్చింది. 27 తేది ఉదయం సమ్మెలో పాల్గొనని లెక్చరర్లను విద్యార్థులు బలవంతంగా ఈడ్చుకొచ్చి, బయటపడవేశారట. రామసుబ్రహ్మణ్యం విషయంలో ఇది మరీ శృతిమించినట్టుంది. ఆయన్ను మెడబట్టి వీధిలోకితోసి, గేటు వేశారట. ప్రిన్సిపల్‌నుకూడా గదిలోనుంచి బయటకు లాగారట. రోటీ లెక్చరర్ల ప్రోత్సాహమే ఇందుకు కారణమన్నది ఒక ఆరోపణ. కాలేజిలలో గురు శిష్యసంబంధాలు ఎంత పుణ్యతస్థాయికి చేరాయుండి!

ఈ దౌర్జన్య ఫలితంగానేమో. 28 తేది ప్రిన్సిపల్ పోలీసు బందోబస్తు ఏర్పాటుచేశారు; వారు పికెటింగ్‌చేస్తున్న 10 మంది లెక్చరర్లను అరెస్టు చేసి తర్వాత వదలిపెట్టారు. సర్వోదయ కాలేజిలో సమ్మె సాఫీగా జరిగిపోతూంది. నాన్‌టీచింగ్ స్టాఫ్ కూడా సమ్మెలో పాల్గొంటున్నారు. విద్యానగర్ కాలేజిలో లెక్చరర్లకు మద్దతుగా, విద్యార్థులే ప్రాక్టికల్స్ బహిష్కరించారు. గూడూరు కాలేజిలలోకూడా సమ్మె జరుగుతూంది. ప్రాక్టికల్స్ నిర్వహించలేకపోయారు.

కావలి జవహర్‌భారతి కాలేజిలో పికెటింగు చేస్తుండిన 32 మంది లెక్చరర్లను ఎస్. ఐ. శ్రీ రమణరావు 27 తేది అరెస్టుచేసి, రాత్రి నిర్బంధంలో వుంచి, ఈరోజు (28 తే.) కోర్టుకు హాజరుపరచారు. అరెస్టైనవారిలో శ్రీమతి లలిత (రామకృష్ణహాదారి సతీమణి) శ్రీమతి రాజ్యలక్ష్మి, శ్రీమతి విజయలక్ష్మి, వైస్ ప్రిన్సిపల్ శ్రీ రత్నాజోసెఫ్‌కూడా వున్నారు.

ప్రిన్సిపల్ శ్రీ నరసింహరావు గారి రిపోర్టుమీద చురుకెక్కిన పోలీస్ ఇంత కఠినంగా వ్యవహరించినట్టుంది కాని, లేకుంటే పికెటింగు, రాత్రి జైలులో నిర్బంధించదగినంతటి పెద్ద నేరమా?

ఇక్కడకూడా రెండు రోజులు ప్రాక్టికల్ పరీక్షలు జరగలేదు. ★

## దశరథుడుగా రామకృష్ణరావు

నెల్లూరు త్యాగరాజ నాట్యమండలి అధ్యక్షుడు శ్రీ ఎం. వి. రామకృష్ణరావు ఇటీవల సాయిబాబా మందిరంలో ప్రదర్శించిన దశరథుని ఏకపాత్రాభినయం ప్రేక్షకుల మన్ననలు పొందింది.

## చక్కెర ఫ్యాక్టరీ

(5వ పేజీ తరువాయి)

త్రిప్పి పంపబడతాయని, ఈ సీజను పర్తి అయిన తరువాత చెరకు పూర్తిగా ఆ రేపవరకు ఫ్యాక్టరీ పనిచేస్తుందని, కటింగ్ ఆర్డర్లు నాటినవారికి క్రమబద్ధంగా జరిపే ఏర్పాటు చేయబడుతుందని కలెక్టరు రైతు ప్రతినిధులకు హామీఇచ్చినట్లు తెలిసింది. అయితే కలెక్టరుగారు ఒక షరతు పెట్టారట. గ్రేడింగు అధికారాన్ని తాము వుంచుకుంటామన్నారు. గ్రేడింగు అనేది ఒకటుంటుందిగదా: అసలు జరప కుండా, ఎన్నిహక్కులు వుంచుకుంటే మాత్రం రైతులకు నష్టంలేదుగదా!

23 తేది కలెక్టరుగారు ఫ్యాక్టరీవద్దకు వచ్చి ధర్నాలోవున్న రైతుప్రతినిధులకు ఈ హామీలవిషయం లాంఛనంగా ప్రకటించవలసినట్లు అనుకున్నారట. కలెక్టరుగారు ఆవిధంగానే ప్రకటించడం, రైతులు 24 తేది నుండి ధర్నా విరమించడం జరిగింది. అప్పటినుండి గ్రేడింగు గిడింగు లేకుండా సాఫీగా సాగి పోతున్నట్లుంది.

ఎం. డి. గారు ఎంత మొండివైఖరి అవలంబిస్తున్నారో తెలిసికోదానికి కలెక్టరుకే స్వయంగా అవకాశం లభించి నట్లుంది. 24 తేది కలెక్టరుగారు ఫ్యాక్టరీ వద్ద వున్నప్పుడే రేబాలకు చెందిన దేవం హరి అనే రైతు చెరకు సగం దించిన తర్వాత నిరాకరించి, వెనక్కు తీసుక పొమ్మన్నారట. అతను ఎదురుతిరిగి లోకల్ ఆఫీసువద్ద ఆ చెరకు ట్రాక్టరును అడ్డంపెట్టేశాడట; దాంతో 50, 60 వాహనాలు నిల్చిపోయాయట; 3నుండి సాయంత్రం 6 గం.కు కలెక్టరు వచ్చేవరకు ఆ ట్రాక్టరు అట్లనే వుణ్ణింది. ట్రాక్టరులోని చెరకునుచూచి అది బాగున్నదని, తీసుకో మని కలెక్టరు ఆదేశించినప్పటికీ అతి బలవంతంగా తీసుకున్నారట. ఎం. డి. విషయంలో రైతులు చెప్తున్నది నిజమని కలెక్టరుగారికి అవగాహనకువచ్చి వుంటుంది. ప్రతి ఆదివారం తాను ఫ్యాక్టరీకి వస్తానని, ఏమైనా సమస్య లున్నట్లయితే అక్కడికక్కడే పరిష్కరిస్తామని కలెక్టరుగారు హామీ ఇచ్చారట.

కలెక్టరుగారు సామరస్యవైఖరి నవలంబించి రైతులచేత ఆందోళన విరమింప జేసినా, ఎం. డి. రైతునాయకులమీద కక్షసాధింపుచర్యలు మానలేదని చెప్తున్నారు. చెరకు రైతుసంఘం అధ్యక్షులైన శ్రీ మారాల తిమ్మయ్య రెడ్డిగారి చెరకును తిరస్కరిస్తున్నారట; అట్లనే రేబాలకు చెందిన శ్రీ విజయమోహన్‌రెడ్డికి అగ్రిమెంటు ఇవ్వడానికి నిరాకరిస్తున్నారట. ఇవన్నీకాక ఏప్రెల్ ఆఖరుకు ఫ్యాక్టరీమూసివేస్తామని బెదరిస్తున్నారట. ఇదిజరిగితే 50 వేల టన్నుల చెరకు ఆడకుండా నిల్చిపోతుంది; రైతులు అన్యాయమైపోతారు. కలెక్టరుగారు ఈఅన్నివిషయాల్లో రైతులకుఅన్యాయం జరగకుండా చూడడం అవసరం. ★

## జిల్లా వార్తలు

(5వ పేజీ తరువాయి)

గూడూరీయులకు తెలియదు. అంత సక్రమంగా నడుస్తూందిది. కొత్త పాలకవర్గమైనా, ప్రజలలో సూపర్‌బజార్‌కు ప్రాచుర్యం కల్పిస్తుందేమో చూడాలి.

### కలిచేడు ఆస్పత్రి కోర్కె

కలిచేడు మైకా ఆస్పత్రిలో ఏడాది నుంచి లేడీ డాక్టర్ లేదట. రోజుకు 200 మంది స్త్రీలు ఈ ఆస్పత్రికి వస్తుంటారని, అందువల్ల తక్షణం డాక్టరమ్మను నియమించాలని గ్రామస్తులు కోరుతున్నారు.

### ఉదయగిరి ఫిర్యాదు

ఉదయగిరి తాలూకా, అయ్యవారిపల్లె స్కూలునుంచి, డి. డి. ఓ. ఒక టీచరును పోస్టుతోసహా బదిలీచేశాడట. డి. ఇ. ఓ. అది అక్రమమని, వెంటనే ఆ పోస్టును పునరుద్ధరించమనిఆదేశించినా పట్టించుకో లేదట. సర్పంచ్ శ్రీరాం బాలసుబ్బరాయుడు ఉన్నతాధికార్లకుఫిర్యాదుచేశాడు. ఈ స్కూలులో 100 మంది పిల్లలున్నారట. వుండేటీచర్లు నలుగురైతే, అందులో ఒకరు ఉర్దూటీచరట.

### ఎ. ఎస్. పేట స్కూలు

ఎ. ఎస్. పేట జి ప హైస్కూలు వార్షికోత్సవం 13 తేద జరిగింది. డాక్టర్ వై. దశరథరామిరెడ్డి అధ్యక్షించారు. హెడ్మాస్టరు శ్రీ కె. హనుమంతరావు నివేదిక చదివారు. ఎం. ఆర్. ఓ. శ్రీ వి. కృష్ణారావు బహుమతులు పంచారు. డాక్టర్ ఎస్. జనార్దనరావు మాట్లాడారు.

### చీరలు దొరికాయి

వెంకటగిరి శ్రీనివాస చేనేత వస్త్రాలయంలో గత నెలలో చోరీపోయిన లక్ష రూపాయల విలువైన చీరలు, జరీకట్టలను పోలీసులు తిరిగి స్వాధీనం చేసుకున్నారట. వివరాలు తెలియలేదు.

(6వ పేజీ తరువాయి)

రిజర్వాయరుక్రిందవున్న లక్ష యాభై ఎకరాలకుచెందిన రైతుశ్రేయస్సుదృష్ట్యా ఒక్కచుక్కనీరు వృధాగా పైడేరు-మలిదేవిద్వారా సముద్రంపాల్జేయవద్దంటారు విడవలూరు వగైరా గ్రామాలరైతులు; చెర్లోసాగైవున్న తమ పైరు కాపాడడానికి మట్టం తగ్గించమంటారట పేదలు.

బహుళ సంఖ్యాకులకు ఏనిర్ణయం లాభదాయకమో అధికార్లు నిష్పాక్షికంగా ఆ నిర్ణయాన్ని తీసుకోవడం బాగుంటుంది.

### పోస్టల్‌శాఖ సమర్థత

కోవూరు నుండి మా పాఠకుడు శ్రీ పర్వతరెడ్డి సుందరరామిరెడ్డి ఇట్లా వ్రాస్తున్నాడు-

"ఈ వారం పేపరు రాలేదు. ఎవరో తిన్నారు. మాకు వేరే పేపరు పంపవలసినది."

ఎవరో తిన్నారట పాపం! కాగితాలు తినేది గాడిద; ఏ గాడిద తిన్నదోమరి!

పాఠకులనుండి ఇటువంటి ఫిర్యాదులు అసంఖ్యాకం. ఎంతమందికని రెండవ పత్రిక పంపగలం? ఒకరికి ఒకటి పంపడమే గిట్టుబాటుకానిరోజుల్లో, ఒక్కో పాఠకునకు రెండేసి పత్రికలు అచ్చువేయడం సాధ్యమా?

కాగితంమీద పోస్టల్ సౌకర్యం విస్తరించి పోతున్నది; సమర్థత దృష్ట్యా మాత్రం తరిగిపోతున్నది.

అయ్యా, పోస్టల్ శాఖ పెద్దలారా! మీరు, మీ బంధుమిత్రులు చదువుకున్న తర్వాతైనా దయచేసి మా పత్రికను పాఠకులకు చేర్చండి: ధన్యవాదములు చెప్పుకుంటాము.

### యూత్ కాంగ్రెస్ మెడికల్ క్యాంపు

జిల్లా యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా నియమితుడైన శ్రీ మెట్టా చంద్రశేఖరరెడ్డి మొట్టమొదటి కార్యక్రమంగా వైద్యసేవను చేపడుతున్నారు.

మార్చి 1 తేది ఉదయం 9 గంటలకు మునిసిపల్ లిమిట్సులోచేరి ముత్తుకూరు రోడ్డులో కాస్తదూరంగా వున్న యూకో నగర్ కాలనీలో ఏర్పాటైన వైద్య శిబిరానికి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి ప్రారంభోత్సవం జరుపుతారు; రాష్ట్ర యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వాలిన సూర్యభాస్కరరావు అధ్యక్షత వహిస్తారు; టవున్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ బషీర్ అహమ్మద్ పతాకావిష్కరణ గావిస్తారు.

### మరణాలు

కావలి డిప్యూటీ మెడికల్ ఆఫీసరు డాక్టర్ మహమ్మద్ హుసేన్ (55) 22 తేది మద్రాసు ఆస్పత్రిలో మరణించగా, కావలిలో అంత్యక్రియలు జరిగాయి అంతిమయాత్రలో జిల్లావైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ ఎ. రామరెడ్డి, అడిషనల్ మెడికల్ ఆఫీసరు డాక్టర్ శ్రీమతి లలిత రమణ పాల్గొన్నారు.

• • •

నెల్లూరు ట్రంకురోడ్డు గాంధీబొమ్మ పెట్రోలుబంకుయజమాని శ్రీ వి. దశరథ రామయ్య (58) 26 తేది సాయంత్రం గుండెపోటుతో హఠాత్తుగా మరణించాడు. ఆయనకు భార్య, ఆర్గురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు వున్నారు.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు (9672) | | |
| .. | పాతవి | 1850-00 |
| .. | కొత్తవి | 1370-00 |

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 21.40 అ. |
| సర్వేపల్లి | 10.45 అ. |
| నెల్లూరు చెరువు | 16.60 అ. |



## ప్లాటు అమ్మబడును

నెల్లూరు, వేదాయపాళెం రైల్వే స్టేషన్‌కు ట్రంక్ రోడ్డుకు మధ్యలోని 34.5 అంకణముల ప్లాటు అమ్మబడును వివరాలకు:

పి. వీరశేఖరం,
లక్ష్మీనగరు, బాలాజీనగరు
నెల్లూరు 2. ఫోన్: 5686
C/o. శ్రీ రాజరాజేశ్వరి ఫర్నిచర్‌వర్క్సు



కోవెరపాళెం గ్రామపంచాయతీ

## టెండరు నోటీసు

ఇందుకూరుపేట సమితి కోవెరపాళెం గ్రామపంచాయతీకి కావలసిన యం. వి. ల్యాంపులు (250 వా) ఫిక్చర్లు, క్లాంపులు, జి ఐ. పైపు మొదలగునవి కలిపి 4 సెట్లు, 4' ట్యూబ్‌లైట్ అన్నీ కలిపి ఒకసెట్ సప్లయిచేయుటకు మా గ్రామ పంచాయతీ కార్యాలయంలో 5-3-88 తేది సాయంకాలం 3 గంటలవరకు సీల్డు టెండర్లు తీసుకొనబడి, అదేరోజు సాయంత్రము 4 గంటలకు హాజరైన టెండరుదార్ల సమక్షమున తెరువబడును. ధరావత్తు రూ 100/- లు చెల్లించి టెండర్లు దాఖలుచేయవలెను. మిగతా వివరములు గ్రామపంచాయతీ ఆఫీసులో తెలుసుకొనవచ్చును.

టి. సుబ్బయ్య, సర్పంచ్

## అద్దెకివ్వబడును

నెల్లూరు టౌన్ వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్ ప్రక్కన జండావీధి మొదట్లో అన్నివ్యాపారాలకు అనువైనదోలు, డోర్ నంబరు 19/413 రెండంతస్తులభవనం, ప్రభుత్వ కార్యాలయాలకు, ప్రైవెటు వ్యాపార సంస్థలకు, బ్యాంకులు, విద్యాసంస్థలు నడుపుకొనుటకు అద్దెకివ్వబడును. వివరములకు- ఫోన్ : 5451 మధ్యాహ్నం 3 గంటల నుండి 7 గంటల లోపల సంప్రదించండి.

## జమీన్ రైతు చందా

| | |
|---|---|
| ఆరు నెలలకు | 28.00 |
| సంవత్సరానికి | 50.00 |
| విడి ప్రతి | ఒక రూపాయి |

"అమ్మమ్మ అంతమాటంటానా" - రావుగోపాలరావు

# జమునమీద హైదరాబాదులో నోరు పారేసుకున్నాడు- మద్రాసులో లేదంటున్నాడు!

ఇటీవల హైదరాబాద్-సికిందరాబాద్ జంటనగరాలలో జరిగిన మునిసిపల్ ఎన్నికల ప్రచారంలో తెలుగుదేశం పార్టీ తరఫున సినీనటులు నందమూరి బాలకృష్ణ, మురళీమోహన్, రావు గోపాలరావు పాల్గొనడం జనరల్ ఎన్నికలలో

మా మద్రాసు
సినీ విలేఖరి

కలిగేంతటి ఉద్రిక్తమైన వాతావరణం సృష్టించింది.

బాలకృష్ణ, మురళీమోహన్‌లు హీరోలవడంవల్ల కాస్త జాగ్రత్తగానే ఉపన్యసించారుగాని, రావు గోపాలరావు కాస్త ప్రసంగంచేయడం సినిమారంగంలో వర్గంవారికి ఒకింతబాధ కలిగించింది. ఆయన ఇసామియా బజార్‌లో అలనాటి మేటినటీమణి జమునను సభ్యత, సంస్కారంలేకుండా "పిచ్చిముండ" అనడంలో సభలోని మహిళలు, యువకులు "సంస్కారంలేకుండా మాట్లాడతావా? వెళ్లిపో!" అని నిరసిస్తూ, కొందరు దేహశుద్ధికూడా చేయబోయారట. సమయానికి పోలీసులు జోక్యం కల్గించుకోకపోతే ఆయనగతి ఏమయ్యేదో! చివరకి రావు గోపాలరావు నోరుజారినందుకు క్షమాపణ చెప్పక తప్పిందికాదు. ఈవిషయం అంతటితో ఆగిపోలేదు.

మద్రాసు సినిమారంగంలోని ఒక వర్గంవారు ఆయన జమునను అలా అన్నందుకు నొచ్చుకున్నారు.

మద్రాసుకు వచ్చిన రావు గోపాలనుని కొందరు సాటి నటీనటులు ఈ విషయం నిజమేనా అనడిగితే, "సోదరి మహానటి జమునను అంతమాటంటానా? వొట్టి అమాయకురాలని అని వుంటాను. దానికి విపరీతార్థాలుచేసి, కొందరు గిట్టనివాళ్ళు చేసినదుష్ప్రచారమిది. అంతే.... అమ్మమ్మమ్మ.... అంత తొందరపడి నేను మాటజారడమే! నేనిలా అన్నానని ఎవరైనా రుజువు చేస్తే, తెలుగుదేశంపార్టీ నుంచేకాక అసలు, రాజకీయాలనుంచే తప్పుకుంటానని శపథంచేస్తున్నాను" అన్నారట.

మొత్తం మీద రావు గోపాలరావుకి ఇటీవల ఎక్కువచిత్రాలు వుండడంలేదు. దాసరి నారాయణరావు ఆయన్నసలు తన చిత్రాలలో బుక్ చేసుకోవడంలేదు. ఇట్చున మరికొందరి చిత్రాల్లోకూడా ఆయన వుండరేమో! తెలుగుదేశం పార్టీకి చెందినవారి చిత్రాల్లోనే ఆయన వేషాలు పరిమితమైపోతాయి.

నోరు మంచిదైతే వూరు మంచిదవుతుందన్న సత్యాన్ని ఆయన ఈపాటికి గుర్తించివుంటారు.

### విజయశాంతికూడా చిత్రం నిర్మిస్తుందా?

జయసుధ "ఆదిదంపతులు" నిర్మిస్తోంది. జయప్రద "కృష్ణవేణి" చిత్రాన్ని హిందీలో నిర్మిస్తోంది. శ్రీదేవి, చిరంజీవి హీరోగా కోదండరామిరెడ్డి డైరెక్షన్‌లో ఓచిత్రాన్ని తీయడానికి సన్నాహాలు చేస్తోంది. దీప మళయాళంలో ఓచిత్రాన్ని తీస్తోంది. రాధిక "రాక్షస ప్రేమ" చిత్రాన్ని తెలుగులో డబ్ చేసి, చేతులు కాల్చుకుంది. సిల్క్‌స్మిత తెలుగు, మలయాళభాషల్లో ఓచిత్రానికి ఉపక్రమించింది. వీళ్ళందర్నీచూసి విజయశాంతికి కూడా ఓ చిత్రాన్ని తీయాలన్న తలంపు కలుగుతోంది. అది కార్యరూపం దాలిస్తే కె. రాఘవేంద్రరావే డైరెక్టర్ అవుతాడు.

### భవనాలలో షూటింగ్‌లకు అడ్డు

స్టూడియోలతో నిమిత్తంలేకుండా విడివిడిగా కొన్ని భవంతులలో షూటింగ్‌లు జరపడం మామూలైపోయింది. మద్రాసు అణ్ణానగర్‌లో ఒకభవంతిలో ఒకచిత్రం షూటింగ్ జరుగుతోంది. రోడ్డుమీద జనరేటర్ రణగొణధ్వని, రాకపోకలకు అంతరాయంగా ఆపివున్నకార్లు, తారలను చూడడానికి ఎగబడేజనం, ఈ కిటకిటలతో విసుగెత్తిన పొరుగింటి ఒక ప్రముఖ న్యాయవాది పోలీసులకు ఫోన్ చేశాడు. పోలీసులువచ్చి షూటింగ్‌ను ఆపుచేయించారు. ఈ విషయాన్ని తమిళనాడు అసెంబ్లీలో చర్చకు వచ్చింది కూడాను. నివాసయోగ్యమైన భవంతిని షూటింగ్‌కు వినియోగించినందుకుగాను ఆభవంతికిపన్ను పెంచారటకార్పొరేషన్.



'ముద్దుకృష్ణయ్య'లో విజయశాంతి నృత్యభంగిమ



మనసులు కలకాయేమో, మరి చూపులూ?
మంచిమనసులులో భానుప్రియ, కపిలదేవ్

# కృపాకరరెడ్డి తొలిచిత్రం

నెల్లూరీయుడు ఎన్. కృపాకర్ రెడ్డి ఉన్నతమైన ఆశయాలు, ఉత్తమాభిరుచి గల యువకుడు. ఈయన శ్రీ కామాక్షి క్రియేషన్స్ అనేసంస్థను నెలకొల్పి, తొలిచిత్రాన్ని ప్రారంభించాడు. గుల్జార్‌చిత్రం "పరిచయ్" హక్కులుకొని, తెలుగులో నిర్మించడం హర్షణీయమైన విషయం. ఎంత మొండివారినయినా ప్రేమతో, అనురాగంతో మార్చవచ్చుగాని, బెదిరించి, హింసించి వారిలో పరిణామం తీసుకరావాలనుకోవడం వొట్టిభ్రమే అనే చక్కని ఇతివృత్తం. ఒక ధనవంతుల కుటుంబంలోకి ట్యూటర్ గా ప్రవేశించిన ఓ యువకుడు అపమార్గంపట్టిన ఆఇంటిలోని పిల్లలకు భుజంతట్టి, బుద్ధిచెప్పి, క్రమశిక్షణలో మంచివారుగా తీర్చిదిద్దుతాడు. ఈ పాత్ర భానుచందర్‌కి దొరకడం అతని అదృష్టం. దానికి తగ్గట్టు దొరికిన అవకాశాన్ని సద్వినియోగంచేసుకుంటున్నాడు. ఎప్పుడూ ఫైట్స్ తో విసుగెత్తిపోయిన భానుచందర్‌కి ఇదొక విభిన్నమైనపాత్ర. అతని శిష్యురాలిగా అమల అనే అందమైన బెంగాలీయువతి నటిస్తోంది. శరత్‌బాబు, సత్యనారాయణ, వేలు, బెనర్జీ, ఎస్. వరలక్ష్మి, మాస్టర్ హరి, బేబీ సీత, పొట్టిప్రసాద్, ఇతర పాత్రధారులు. మాటలు: గణేష్ పాత్రో. మ్యూజిక్: చక్రవర్తి. కెమెరా: సుధాకర్‌రెడ్డి. డైరెక్షన్: ఎన్. రామచంద్రరావు. ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: ఎస్. కృష్ణప్రసాద్‌రెడ్డి. ఏప్రిల్‌లో షూటింగ్ పూర్తయి, మేలో విడుదలవుతుంది. ఈ చిత్రం తర్వాత శోభన్‌బాబు, విజయశాంతి నాయికానాయకులుగా ఈ సంస్థ తదుపరిచిత్రాన్ని రాజాచంద్ర దర్శకత్వంలో నిర్మిస్తుంది. ★

# హిందీ దర్శకుడుగా బాపు

శత్రుఘ్నసిన్హా సోదరుడు లక్ష్మణ్ సిన్హా నిర్మించే రామాయణ్ చిత్ర అసోసియేట్స్‌వారి చిత్రానికి బాపు దర్శకుడు. ఇదికాక సూర్యనారాయణ నిర్మించే భానోదయసంస్థ చిత్రంషూటింగ్ ఫిబ్రవరి 12న కేరళలో మొదలైంది. ఇందులో అనిల్‌కపూర్, మాధురి, అశోక్‌కుమార్, ప్రాణ్, ఖాదర్‌ఖాన్, నిరూపరాయ్, బిందు పాల్గొంటున్నారు. ఆర్. డి. బర్మన్ మ్యూజిక్ డైరెక్టర్.

ముళ్లపూడి రమణతో కలిసి బాపు నిర్మించే హిందీచిత్రం త్వరలో ప్రారంభమవుతుంది.

ఈ రోజుల్లో హిందీచిత్ర నిర్మాణానికి అయ్యేంతఖర్చు తెలుగుచిత్రానికి అవుతోంది. అందేత మరికొందరు తెలుగు నిర్మాతలుకూడా హిందీలో చిత్రాలుతీయడానికి సన్నాహాలు చేస్తున్నారు. ★

## ఫిల్మోత్సవ్

(11 పేజీ తరువాయి)

అనిపించే ఇష్టపడుతుంది. ఆమెకు తన ప్రేమను ఎలా ప్రకటించాలో తెలియదు. తనకన్నా వయసులో ఎంతో చిన్నదైన ఆ అమ్మాయిని ప్రేమించినట్లు తెలిస్తే లోకం నవ్విపోతుందని ఆమె గాఢంగా సంకోచం. ఆ వ్యక్తి ఏదో ఒకరోజు తన ప్రేమను వ్యక్తం చేయకపోతాడా అని ఆమె ఎదురు చూస్తూవుంటుంది. అవ్యక్తి హఠాత్తుగా ఆమె జీవితంనుండి తొలగిపోతాడు. ఆ వ్యక్తితో గడిపిన అద్భుత క్షణాలు మాత్రమే ఆమె జ్ఞాపకపథంలో మిగిలిపోతాయి. ఆమె తన శేష జీవితాన్ని ఒంటరిగా జ్ఞాపకాలతో జీవించడానికి నిర్ణయం తీసుకొంటుంది.

### దశాపో

ఐటాలియన్ భాషలో దశాపో అంటే మళ్ళీ ఆరంభించడం. ఫిన్నిష్ వయొలిన్ సంగీత విద్వాంసుడు హైమో జీవితం చుట్టూ అల్లుకొన్న కథ ఇది.

హైమో శక్తి ఆతని బాల్యంలోనే ఒక సంగీత విద్వాంసుడికి ఇచ్చివేస్తుంది. హైమో ఆ గురువుగారివద్ద పదేళ్ళపాటు విద్యాభ్యాసం చేస్తాడు. ఈ పదేళ్ళ నిరంతర సాధనలో అతని బాల్యం గడచిపోతుంది. హైమో బాల్యం అనేది ఎరుగడు. బాల్యంనుంచి యవ్వనంలోకి మారడం అనేపరిణామం క్రమంగా జరగదు. హైమో గురువుగారి పట్టు వదల్చుకొని ఎక్కడెక్కడో తిరుగుతాడు. ఫిన్నిష్ సంఘ సంస్కరణోద్యమంలో పనిచేస్తున్న ఒక స్త్రీని పెళ్ళిచేసుకొంటాడు. ఈ పెళ్ళికూడా హైమోకు శాంతినీయదు. హైమో అంతరంగంలోని అశాంతినీ, అలజడినీ దర్శకుడు చక్కగా చిత్రీకరించాడు. అమెరికాలోని నైట్‌క్లబ్ జీవితం, వెనిస్ విలాస ప్రశాంత సాగరతీరాలు అతడి మానసిక పరిస్థితిని చక్కగా ఆవిష్కరిస్తాయి. సంగీతం, ప్రకృతి మనిషి మనస్సుకు అర్థం పడతాయి.

హైమో చివరకు జీవితంతో సమాధానపడతాడు.

### ఏ మూమెంట్ ఇజా టైమ్

విదేశీచిత్రాలలో గణనీయమైన సంఖ్యలో నే "ఏజ్ కో ఎనాలసిస్" వస్తువుగావచ్చిన చిత్రాలున్నాయి. దశాపో, ఆదెలా ఈ కోవలోని చిత్రాలు అట్లాగే ఈ ఫ్రెంచి చిత్రంకూడా వృద్ధాప్యంలో మనిషి స్నేహంకోసం, సాటిమానవుల సాన్నిహిత్యం కోసం ఎంతగా ఆరాటపడేది చిత్రీకరించారు.

వృద్ధాప్యం జీవితాన్ని నీరసింపజేస్తుంది. కాలంగడవడం కష్టమైపోతుంది. మృత్యువుకోసం నిరీక్షించడమే ఇకనిత్య కృత్యం అవుతుంది. సమాజంతో పెద్దగా సంబంధాలులేని ఒక వృద్ధదంపతులు తమ యాభయ్యో వివాహ వార్షికోత్సవాన్ని ఒంటరిగా జరుపుకొంటారు. జారిపడి ముసలామె కాలు విరగగొట్టుకుంటుంది: ఆస్పత్రిపాలౌతుంది. భర్తరోజూ ఆస్పత్రికివెళ్ళి ఆమెను పలకరించి వస్తూవుంటాడు. ఒంటరితనం దిక్కుతోచకుండా చేస్తుంది. డాక్టర్ అనుమతితో తానూ ఆస్పత్రిలో వుంటాడు. ఆమెకు నయం అయ్యాక మళ్ళీ ఇంటికి చేరుకుంటారు. మృత్యువు ఏ మూలలో నక్కివుందనే ఆలోచన వాళ్ళను కలవరపెడుతూనే వుంటుంది.

జీవితం నిత్య చైతన్యవంతంగా వుండాలి. జీవితంలో స్తబ్దతకు చోటు లేదు అని ;ఈ చిత్రం చెప్తుంది. మానవ జీవితంలో ఏ దశలైనా, కళాత్మక చిత్రీకరణకు పనికివస్తుందని ఈ సినిమా చక్కగా నిరూపించింది.

### క్వొశ్చెన్ టైమ్స్

మనిషి ఎప్పుడో ఒకప్పుడు కాస్త ఆగి వెనక్కు తిరిగి చూసుకోక తప్పదు: పరామర్శించుకోక తప్పదు. తన జీవిత సాఫల్యాన్ని గురించి ప్రశ్నించుకోక తప్పదు.

బుచ్ గొప్ప నటుడు. అతడి గొప్పతనానికి, గొప్పతనానికి వెనుక నిరంతర సాధన ఉంది, కృషిఉంది. బల్గేరియా టి. వి. కార్యక్రమాలలో క్వొశ్చెన్‌టైమ్స్ ప్రసిద్ధిచెందినది. సుప్రసిద్ధులైన వ్యక్తుల్ని ఈ కార్యక్రమంలో ఇంటర్వ్యూ చేస్తూ ఉంటారు. బుచ్‌నుకూడా ఇంటర్వ్యూ చేస్తారు. ఆ తర్వాత కొద్దికాలానికి అతడు తీవ్రంగా అస్వస్థుడౌతాడు. తన నట జీవితానికి తెర పడబోతున్నదన్న విషయం ఎంతో కలవర పెడుతుంది, విషాదం అతడి ఎదనిండా పరచుకొంటుంది. బుచ్ జీవితంలో నిజంగానే క్వొశ్చెన్‌టైమ్స్ ఎదురైంది; జీవితాన్ని ఒకసారి సమీక్షించుకొంటాడు. ప్రేమ, వైఫల్యం, తన బిడ్డలు తనకు దూరంకావడం అన్నీ స్మృతిపథంలో మెదులుతాయి. జీవితం ఎంతవిచిత్రమైందో తెలిసివస్తుంది.

మరియానా తన సహనటి. ఆమెను తాను ఎంత అభిమానించినా, ఆమె విశృంఖలవర్తన, మద్యపానం తనను బాధిస్తాయి. తిమమధ్య నడచిన సంఘటనలు గుర్తుకువస్తాయి. తన జీవితంవ్యర్థం కాలేదనేభావం బుచ్‌కి ఎంతో పూరటనిస్తుంది.

బుచ్ చిన్నవాడుగా వున్నప్పుడు ఒక గుట్టను ఎక్కుతూ కనిపిస్తాడు. ఇది సినిమాలో ఆరంభదృశ్యం. పెద్దవాడుగా బుచ్ ఒక గుట్టను ఎక్కుతున్నట్లు సినిమాలో చివరిదృశ్యంగా చూపుతారు. జీవితంలో ప్రతి వ్యక్తికి ఎప్పుడో ఒకప్పుడు క్వొశ్చెన్ టైమ్స్ - ఎదురుకాక తప్పదు. అతడిసామాజికజీవితం, ఆచరణా అన్వేషణే ఆ ప్రశ్నకు సమాధానం చెబుతాయి. ★

## పినాకినీతీరం

(3వ పేజీ తరువాయి)

తంతో ఈ మాటలన్నారు శ్రీ పాపిరెడ్డి. రామారావుగార్ని పైనవేసుకొనిత్వేదానికి శ్రీ పి. ఎ. చౌదరిగారు అనుకునేదేముంది? ఇందిరాగాంధీని ఇందిరమ్మో పోలేరమ్మో అని హేళనచేస్తాడు ఈయన: నిజమే. తన వ్యతిరేకులకు వాంతులు భేదులు అయ్యేట్టు చేసింది కాబట్టి పాపిరెడ్డి కంటే కాంగ్రెస్ వ్యతిరేకుల కంటికి ఆమె పోలేరమ్మగానే ప్రత్యక్షమై వుండవచ్చు!

శ్రీ శేషా సాంబమూర్తిగారు చిత్రించిన కీ. శే. బెజవాడ రామచంద్రారెడ్డిగారి తైలవర్ణ చిత్రపటాన్ని హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి. ఏ. చౌదరిగారు ఆవిష్కరించి ఉపన్యసించారు. సహజ మందహాసంతో తలపాగా లేకుండావున్న రామచంద్రారెడ్డిగారి గంభీర రూపం శేషా కుంచెలో జీవకళ వుట్టిపడుతున్నది ఆ పటంలో. న్యాయమూర్తి చౌదరిగారు రామచంద్రారెడ్డిగారిపట్ల తనకు మొదటి నుండి అత్యంత గౌరవాభిమానాలున్నాయన్నారు. జస్టిస్‌పార్టీ ఆవిర్భావాన్ని ఆయన సమర్థించారు; బ్రిటిష్ వాళ్ళ తొత్తుగా వుండిన ఆ పార్టీ దేశానికి మహోపకారం చేసిందని చౌదరిగారు ఏ భావంతో అన్నారోగాని మావోంట్లకు మింగుడుపడనిఅభిప్రాయం అది. పత్రికలకు సంబంధించి శ్రీ చౌదరి వెలిబుచ్చిన అభిప్రాయాలు విలువైనవి.

ధనెంకులను ఆయన "మిత్రుడు, సచివుడు, బంధువు"గా పేర్కొన్నారు. న్యాయమూర్తిగా తాను మాట్లాడవచ్చునో లేదో అనే అనుమానంకలిగి వారే సమాధానం చెప్పుకున్నారు- "నా అరవైఏళ్ళ జీవితంలో నా అనుబంధమంతా అధికారంలో లేనివారితోనే" అన్నారాయన. ధనెంకుల ప్రతిపక్షీయుడుకాదని, అధికార పార్టీవాడేననేవిషయం చౌదరిగారి స్మృతిలో వున్నట్టులేదు. ఏమిమాట్లాడినా ఔచిత్య అనౌచిత్యాలనుగూర్చి న్యాయమూర్తులను ఆక్షేపించగలిగినవారం కాదుగదా మనం!

మొత్తానికి విజయభేరి సభ మోతగానే వుట్టింది; తాను ఈవిధంగా మరొకసభను ఏర్పాటుచేయగలనో లేదో అన్నట్టుగా భారీగా ఏర్పాట్లు చేసినట్టున్నారు ధనెంకుల. విజయభేరిసభగా కాకుండా గుంటమిట్టలతో కూడిన రాజకీయ రహదారిలో బహుదూరం పయనించిన రాటుపోరిగా ధనెంకుల అభినందనసభగా ఏర్పాటైవుంటే సముచితంగా వుండేది!

— [illegible]

## దేవేంద్ర భవనం

(4వ పేజీ తరువాయి)

యిన నున్నటి ప్లాస్టిక్ చిన్న ఫలకాలు స్టీరియోసిస్టంలో మైకులు గొప్పగాఅమర్చబడ్డాయి. ఆహుజా సౌండ్ సిస్టమ్‌తో ఏర్పడిన యీ మైకుల్లోనిమాటలు హాల్లోవున్నవారికే పరిమితం. బైటవున్నవారిచెవుల్లో గోలపెట్టవు.

టేబుల్సుపై వేసిన సగ్గానులు, ఫోమ్ కుర్చీలు, డోరు కర్టన్లు, విండో కర్టన్లు అన్నీ ఒకేడిజైనులో తెలగోధుమరంగులో చిన్నచిన్న చుక్కలతో కళాత్మకంగా వున్నాయి.

సుఖాసీనత, వీనులకు విస్పష్టమైన వినికిడి ఏర్పరచి నడకకు నాజూకు కూర్చకపోతే బాగుండదనేమో క్రింది మెట్టునుంచి మీటింగుహాలు వరకేగ హాలులోగూడా కార్పెట్టు పరిచారు. ఫ్యాన్లు తిరుగుతూ పదిడెకరేటివు లైట్లు వెలుగుతూ వుంటే చల్లని, వెన్నెల రాత్రిలో కూర్చున్నట్టేగదా! ఇక కలెక్టరు కిట్లు అధికార్ల ఒంటికి అంటవుమరి!

ఇలాంటి మీటింగుహాలు ఏ కలెక్టరు కార్యాలయానికి లేదనే చెప్పాలి.

కలెక్టరు సుజాతారావు, సైక్లోను జాయింటు శ్రీ కలెక్టరు జె. సి. మహంతి హయాంలో అంకురార్పణ జరిగి ప్రస్తుత కలెక్టరు జన్నత్ హుసేన్ చేతుల్లో పరిపూర్ణత చెందిందట యీ మీటింగుహాలు. నిప్పులాంటి అధికారి హుజూరు సిరస్తదారైన పద్మనాభదాసు నిస్వార్థ కృషిగూడా యిందులో యిమిడి వుందంటారు.

—గ్రిగోరా







## నెల్లూరు సంగతులు

(4వ పేజీ తరువాయి)

నాగేంద్ర, కోశాధికారిగా గుర్రంశేషయ్య ఎన్నికైనారు.

### కళాప్రియ వేణుగానం

కళాప్రియ సంస్థ 16 తేది మంచి వేణుగాన కచేరి ఏర్పాటుచేసింది. శ్రీమతి నీల, శ్రీమతి సరోజ కమ్మగా వేణుగాన మాలపించారు.

సంస్థ ప్రధానకార్యదర్శి శ్రీ ప్రయాగ వెంకట్రావు కళాకారులను పరిచయం చేశారు; శ్రీమతి పార్వతి చిదంబరం వారిని సత్కరించారు; కార్యదర్శి రవీంద్ర వందనాలు చెప్పారు.

### వి ఆర్ కాలేజికి రెండు ఛాంపియన్‌షిప్‌లు

డి కె డబ్ల్యు కాలేజిలో ఇటీవల, వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అనుబంధ కాలేజిల స్త్రీలకు క్రీడలపోటీలు జరిగాయి. వీటిలో నెల్లూరు వి ఆర్ కాలేజికి వ్యక్తిగత, టీం ఛాంపియన్‌షిప్‌లు రెండూ లభించాయి. మొదటి సంవత్సరం డిగ్రీ విద్యార్థిని కుమారి కె. కోటేశ్వరమ్మ ఛాంపియన్‌గా గెలుపొందారు.

అదేసమయంలో, ప్రొద్దుటూరులో జరిగిన పురుషుల క్రీడలలో, వి. ఆర్. కాలేజి విద్యార్థి శ్రీ సి. హెచ్. దివాకర్ వ్యక్తిగత ఛాంపియన్‌షిప్ సాధించారు. ఈ పోటీలకు శ్రీయుతులు జి. దయాకర రెడ్డి, ఎం. సి. సుబ్బారెడ్డి, సి. రాధాకృష్ణారెడ్డి మేనేజర్లుగా వ్యవహరించారు.

# నెల్లూరు కీర్తి బ్రెజిల్ సినిమావరకు ప్రాకింది!

## హైదరాబాదు ఫిల్మోత్సవ్‌లో కొన్ని విదేశీచిత్రాలు-

డాక్టర్ పురుషోత్తం సమీక్ష

### స్ట్రాంగ్ మీట్

ఫిల్మోత్సవ్‌లో ప్రదర్శించిన కొన్ని విదేశీ చిత్రాలను ముచ్చటించుకొందాం. స్ట్రాంగ్‌మీట్ బ్రెజిలియన్ చిత్రం. ఈ సినిమాలో నెల్లూరు ఎద్దుల నాణ్యత గురించి, వాటి గొప్పదనం గురించిన ప్రస్తావన ఉంది. నెల్లూరు కీర్తి బ్రెజిల్ సినిమాల వరకూ పాకిందన్నమాట!

క్విమ్ ఆస్తిపాస్తులు లేని పేదగ్రామీణ యువకుడు. నా అన్నవాళ్ళెవరూ లేరు. మంచి అమ్మాయిని పెళ్ళాడాలనేది. మంచి ఎద్దుమాంసం భోంచేయాలనేది- అతడి తీరని కోరికల్లో కొన్ని. (ఎద్దు మాంసం, అందులోనూ మంచి ఎద్దు మాంసం బ్రెజిల్‌లో సంపన్నుల ఆహారం) అందుకోసం ఉన్న ఊరు విడిచి, బయల్దేరుతాడు. దారిలో కార్లా అనే అందమైన గ్రామీణ యువతి తారస పడుతుంది. తన పెళ్ళిలో కట్నంగా ఇవ్వడానికి మాంచి జాతిఎద్దును తన నాన్న మేపుతున్నాడని ఆమె చెబుతుంది, [illegible] ఈసంబంధంకోసం ఎంతోముచ్చట[illegible]డు. తన అల్లుడికికావలసిన అర్హతలేవీ క్విమ్‌లోలేవని ఆమెతండ్రి కొట్టిపారేస్తాడు. కార్లా క్విమ్‌తో పారిపోవడానికి అంగీకరిస్తుంది. కార్లా తండ్రి తన ఎద్దును ఆమె వివాహంలో కట్నంగా ఇవ్వడానికి ఎన్నడూ అంగీకరించలేదనీ, ఇదంతా కార్లా సృష్టించిన కట్టుకథ అనీ, తాను మోసపోయానని క్విమ్ గ్రహిస్తాడు. అప్పటికే అతడికి ఇద్దరు పిల్లలు.

మంచి ఎద్దుమాంసం తినాలన్న క్విమ్ కోరిక మరోవిధంగా తీరుతుంది. ఒక సూపర్ మార్కెట్ లూటీ జరుగుతుంది. జనం చేతికందినది పట్టుకొని పోతారు. క్విమ్ మాత్రం ఎద్దుమాంసం డబ్బాలను తెచ్చుకొంటాడు.

పచ్చి శృంగారానికి, భయంకరమైన హింసకూ బ్రెజిల్ సినిమాలు పెట్టింది పేరు. ఈ సినిమా అందుకు అపవాదుగా నిలుస్తుంది. హాస్యరసం చిలకరిస్తూనే, బ్రెజిల్ సామాజిక, ఆర్థిక పరిస్థితుల్ని చూపుతుంది.

### ఫస్ట్ వైఫ్

పెళ్ళి పెక్కి, బీటలువారి, పగిలి ముక్కలుకావడానికి సిద్ధంగా వున్న వివాహజీవితంలో విడిపోవడం చరమాంకం. దంపతులలో ఎవరికైనా భరించలేని విషాదం ఇది. ఇట్లాంటిపరిస్థితుల్లో స్త్రీ పురుష సంబంధాలు. కుటుంబ జీవితంలో ఏర్పడే సంక్షోభం, బిడ్డలపై ఆ సంక్షోభం చూపే ప్రభావం, ఇవన్నీ 'ఫస్ట్ వైఫ్' అనే చిత్రంలో పురుష దృక్పథంలోంచి [illegible], దర్శకుడు తన స్వీయానుభవాలను ఆధారంగా చేసుకొని ఈ సినిమా తీశాడంటారు.

హెలెనా ఆత్మాభిమానంగల స్త్రీ. భర్త తన వ్యక్తిత్వాన్ని గుర్తించలేదని, అతని హృదయంలో తనకొక స్థానంలేదని గ్రహిస్తుంది. అతని విడిపోవడానికే నిర్ణయించుకొంటుంది. తన ఆరేళ్ళ చిన్నారి పాపకోసం హెలెనా భర్త జాన్ వివాహబంధాన్ని కాపాడుకోవాలని ప్రయత్నిస్తాడు. ఎట్లాగో సర్దుకుపోవడానికి ప్రయత్నిస్తాడు. హెలెనా క్రమంగా మరొక




యువకుడికి దగ్గర అవుతుంది. జాన్ ఇది గ్రహించి లబోదిబో మంటాడు. హెలెనా విడాకులుపొంది తన ఆరేళ్ళ బిడ్డను తనవద్దనే వుంచుకోవాలని నిర్ణయించుకొంటుంది. సంప్రదాయభావనాబద్ధుడైన జాన్ పరిస్థితులను తన గుప్పెట్లో పెట్టుకోలేడు. తన జీవితాన్ని, కష్టసుఖాలను పంచుకొన్నస్త్రీ ఏమీజరగనట్టు వెళ్ళిపోతూవుంటే అతడు సహించలేడు.

దర్శకుడు పోలెడంత సెంటిమెంట్‌ను గుమ్మరించాడు, జాన్ గత స్మృతులను ఎంతో రొమాంటిక్‌గా చూపుతాడు. స్త్రీ పురుషులు ఒకరినొకరు అవగాహన చేసుకోడానికి ఎంతో నేర్పు, ఓర్పు కావాలనేదే చిత్రసందేశం.

### ది హోలీ ఇన్నొసెంట్స్

1960 నాటి స్పెయిన్ దేశపు గ్రామీణ జీవితం ఈ స్పానిష్ చిత్రానికి ఇతివృత్తం. ఇదేపేరుతో రచించబడ్డ ఒక నవల ఆధారంగా ఈ సినిమా తీశారు. అక్కడి గ్రామీణులు, విద్యకోసం, వైద్యం కోసం, ఆరోగ్యకరమైన బ్రతుకుకోసం, మంచి జీవితంకోసం కలవరిస్తారు. పరిస్థితుల మార్పుకోసం ప్రయత్నిస్తారు. అయినా అంతతిన్నగా కరడుగట్టిన పద్ధతులూ, పరిస్థితులూ మారవు. అనూహ్యమైన ఘటన ఏదో ఆ పేదల బతుకుల్లో వెలుగుచూపాలి. పేదలు భూమికోసం పడే తపన, భూస్వాముల పీడన ఇవి అన్నిదేశాల్లోనూ ఉన్నవే. దర్శకుడు ఈ సినిమాను సాధికారంగా తయారు చేశాడు. వాస్తవికత చిత్రానికి ప్రాణం. అందుకే ఈ చిత్రం జనాన్ని విశేషంగా ఆకర్షించింది.

### ది మాజా ఫ్రమ్ మజోరాలా

రాజకీయ కథ ఈ చిత్రానికి కథావస్తువు. 'ఖరప్టిజ' జాతి మూలుగుల లోని సారాన్ని ఎంతగా పీల్చివేసిందో దర్శకుడు ఈ చిత్రంలో శక్తివంతంగా చెప్పగలిగాడు. స్టాక్‌హోంలోని ఒకపెద్ద పోస్టాఫీసులో ఎన్నడూ కనీవినీ ఎరుగని దోపిడీ జరుగుతుంది. గుర్తు తెలియని ముసుగు మనుషులు కోట్లకొలది ధనాన్ని కొంగలించుకొని పోతారు. ఈ దోపిడీ ముఠాను పట్టుకొనేందుకు ఇద్దరు గూఢచారులు నియమించబడతారు. వారి పరిశోధన ఊహించని మలుపులు తిరుగుతుంది. అనేక హత్యలు, ఘటనలు జరుగుతాయి. దోపిడీకి ప్రత్యక్షంగా ఆ సంఘటనలతో ఏసంబంధమూలేనట్లే అనిపిస్తుంది. గూఢచారుల పైఅధికారి దోపిడీ ముఠాను పట్టుకోలేకపోయారని పరిశోధనలో నిమగ్నమైన గూఢచారులను పరిహాసం చేస్తాడు. వాళ్లు దేన్నీ లెక్కచెట్టకుండా నిశ్శబ్దంగా తమ పరిశోధన కొనగిస్తూపోతారు. ఈ దోపిడీకేసులో న్యాయశాఖమంత్రికికూడా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భాగస్వామ్యం వున్నట్టు వాళ్ళు తెలుసుకుంటారు. నేరం జరుగుతున్న సమయంలో, ఆ సమీపంలోని ఒక భవనంలో న్యాయశాఖామంత్రి ఒకవేశ్యతో గడిపినట్లు తెలుస్తుంది. ఈ దోపిడీకి బాధ్యుడైనవ్యక్తి న్యాయశాఖామంత్రికి అంతరంగికుడనికూడా తెలుస్తుంది. ఆ వ్యక్తికి మంత్రి స్వయంగా "ఎలిబీ" సృష్టిస్తాడు. ఈ పరిశోధనాక్రమంలో ఎన్నో అనూహ్యమైన అంశాలు గ్రహిస్తారు.

అయితే ఆ గూఢచారులు ఈ దోపిడీ కేసు రహస్యం బయటపెట్టడం వల్ల తమ జీవితానికి, ఉద్యోగానికి భద్రత లేకుండా పోతుందనిగ్రహిస్తారు, ఈ కేసులో సాక్షులెవరూ ముందుకు రానందున కేసు ముగించివేశామని తెలివిగా తప్పుకుంటారు. ఇట్లాంటి సినిమాలు అన్ని భాషల్లోనూ ఇప్పుడు వస్తున్నాయి. అయితే ముగింపులోనే ఈ సినిమా గొప్పదనం అంతా ఉంది.

### అడెలా

యవ్వనదశ దాటి నడివయసులో అడుగుపెడుతున్న వ్యక్తుల మానసిక పరిస్థితిని దర్శకుడు ఈ సినిమాలో విశ్లేషించాడు. వయసు పైబడుతున్నపుడు వ్యక్తి జీవితంలో గొప్ప సంక్షోభాన్ని ఎదుర్కొంటాడు. ఈ మార్పును సహజంగా భావించి గ్రహించడానికి గొప్ప ఆత్మస్థైర్యం కావాలి. ఇదే దర్శకుడు ఈ చిత్రంద్వారా చెప్పదలచుకున్న అంశం.

అడెలా విడాకుగా తీసుకొన్నది. ఆమె వైవాహిక జీవితం సరిగా రెండు నెలలు కూడా కొనసాగలేదు. అందం, యవ్వనం అన్నీఉన్న ఒంటరి జీవితం ఆమెది. ఆమె తల్లికూడా నడివయసు దాటిన స్త్రీ. ఆమె భర్త కూడా చాలాకాలం కిందటే చనిపోయాడు. వాళ్ళ ఒంటరి జీవితాలు నిరుత్సాహంగా, లక్ష్యహీనంగా గడచిపోతూ ఉంటాయి. అడెలామాత్రం తనకు మంచి జీవితం ముందుముందు ఉండబోతుందని ఆశతో ఉంటుంది.

ఆ రోజుల్లోనే వాళ్ళకు ఒక వ్యక్తి పరిచయం అవుతాడు. అతడు అడెలా వైపు ఆకర్షితుడౌతాడు. అడెలా కూడా

—కొరవ 10 వ పేజీలో

---

చిల్లకూరు గ్రామపంచాయితీ
చిల్లకూరు

### టెండరు ప్రకటన

నెల్లూరుజిల్లా పెళ్ళకూరు మండలం లోని చిల్లకూరు గ్రామపంచాయితీకి 1985-86 సంవత్సరమునకు కావలసిన ట్యూబ్‌లైటు సెట్లు సప్లయి చేయుటకు అథరైజ్డ్ డీలర్ల నుంచి 6-3-86 సోమవారం సాయంత్రం 4 గం॥ వరకు సీల్డు టెండర్లు కోరబడుచున్నవి. టెండర్లు అదేరోజు సాయంత్రం 4-30 గం॥కు హాజరయిన టెండరుదార్ల సమక్షమున సర్పంచ్ గారిచే తెరువబడును. మిగిలిన వివరములు పంచాయితీ కార్యాలయము పనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

వివరం: 40 వాట్సు 4 అడుగుల ట్యూబ్‌లైటు సెట్సు 12, క్లాంప్స్, ఫిక్చర్లు, చౌకులు, స్టార్టర్లు, వైర్లతోసహా (క్రాంప్టన్ కంపెనీ ఒరిజినల్ మాత్రమే) టెండర్లు స్వీకరించుటకు నిరాకరించుటకు అన్ని హక్కులు పంచాయితీ సర్పంచ్‌గారికి పూర్తి అధికారముకలదు.

ధరావత్తు రూ. 300/-లు

-కాపులూరు సుందరరామిరెడ్డి
సర్పంచ్

---

In the court of the Principal District Munsif Kadiri
O. S. 360/79 E. P. 274/84
Sailaja Finance Corporation (Regd.) Kadiri by its Manager A. Adimurthy
-D.Hr.

1) K. C. Narayana
2) Bathu Bayamma
3) Basetty Gangulamma
-J.D.Rs.

—వేలము ప్రకటన—

పై నంబరు దావాలోని వారి పై నెంబరు దావా డిక్రీ బాకీ ప్రతివాదులనుండి రాబట్టుకొనుటకై ఈ క్రింది ప్రతివాదులకు సంబంధించిన స్థిరాస్తులు వేలము నకు కోరియున్నందున సదరు ఆస్తులు 24-3-86 తేదీ ఉదయం 10 గం. లగాయితీ సాయంత్రం 5 గం॥ వరకు పై కోర్టులో వేలము వేయబడును. కొనదలచినవారు వేలములో పాల్గొనవచ్చును

SCHEDULE

Property situate at Donnikota with in the S. R.D. of Kadiri and R. D. of Anantapur.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | Govt. | wet | S. No. 163-1 | Ac. 0-82 |
| 2. | ,, | ,, | 165 | 1-30 |
| 3. | ,, | ,, | 166 | 0-79 |
| 4. | ,, | ,, | 575 | 1-38 |
| 5. | ,, | ,, | 576 | 0-77 |
| 6. | ,, | ,, | 579 | 8-35 |
| | | | | పైకి ½ ఎకరా |
| 7. | ,, | Dry | 591-2 | 1-85 |
| 8. | ,, | ,, | 587 | 3-75 |
| | | | | పూర్తిగా |

D.H.R. Value: Rs. 5,000/-
Ameena Value ,, 10,000/-

Item to the late J. D. K. Buddanna executed a gift deed inrespect of Ac. 0-25 with in the specified boundaries out of 4-17½. The balance may be sold.

-T. Venkataramana
Advocate for D.H.R.

జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |

విడిప్రతి: ఒక రూపాయి

మద్రాసులో 'జమీన్‌రైతు'

మద్రాసు పాండిబజార్ లోని రాణి బుక్ షాపులో 'జమీన్‌రైతు' లభ్యమవుతుంది పాఠకులు గమనించ ప్రార్థన

—మేనేజరు జ.రై.

### పత్రములు పోయినవి

నెల్లూరు, వేదాయపాళెం రచ్చకెరురుగా నెల్లూరు బిట్-1, సర్వే నంబరు 1941, ప్లాటు నెం. 67, 60 అంకెల ములకు సంబంధించి గాకు - తిక్కవరపు కోదాదరక్ మనోహరరెడ్డిగారికి మధ్య జరిగిన విక్రయ పత్రములు, 22-2-86 తేదిన నేను రామమూర్తినగరు నుండి లీలామహల్ మీదుగా చిన్నబజారుకు పోవుచున్నపుడు జారిపోయినవి. అవి ఎవరికైనా దొరకినచో నాకు చేర్పించండి ఆ పత్రములపై ఎట్టటువంటి అనుమానములుగాని, అప్పులుగాని మరేవిధమైన లావాదేవీలుగాని చేయలేదు. పై పత్రములను ఆధారం చేసుకొని ఎవ్వరేని ఏ విధమైన లావాదేవీలు జరిపిననుచెల్లనేరవు నన్నుగాని సదరు ఆస్తినిగాని అవి బద్ధింపవు. అందుకు వారే బాధ్యులగుదురు.

టి. వెంకటక్రిష్ణయ్య,
ఏ.పి. వేర్‌హౌస్ గోడౌన్లకు ఉత్తరప్రక్క
మహాత్మాగాంధీనగరు, నెల్లూరు-4

నేడే విడుదల కృష్ణ (ఎ. సి.) లో

ఇది మన గోపాల్ రెడ్డి చిత్రం
మనందరికి నచ్చే చిత్రం





భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# ముద్దుల క్రిష్ణయ్య

S. గోపాల్ రెడ్డి B.Sc (Ag) * కోడి రామకృష్ణ

గమనిక : ముందుగా చేసుకున్న ఒప్పందం ప్రకారం 'శ్రావణ సంధ్య' 28-2-86 తేది నుండి కల్యాణి (ఏ.సి.) కి మార్చడమైనది.